**శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః**

## శ్రీవేదాంతదేశికులు అనుగ్రహించిన

# శ్రీదయాశతకం



## వ్యాఖ్యానం

'పండితరత్న' డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్యాగ శింగరాచార్యులు

శ్రీదేవి, భూదేవి సమేత శ్రీవేంకటేశ్వర స్వామి వారి

విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమ సందర్భంగా

యావన్మంది రామానుజ భక్తులకు అందిస్తున్న దివ్య జ్ఞాపిక

శ్రీవేదాంతదేశికులు అనుగ్రహించిన

## శ్రీదయాశతకం

వ్యాఖ్యానం : 'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు.

ప్రతులు : 500

ప్రథమ ముద్రణం : 2023

మూల్యం : అమూల్యం

ఈ గ్రంథము శ్రీమతి & శ్రీమాన్ కరాలపాటి నాదబాబు, నాగమణి దంపతులు
మరియు శ్రీమతి & శ్రీమాన్ కరాలపాటి వంశీకృష్ణ, నాగరేష్మ దంపతులు
వారి కుమార్తె చిరంజీవి నైరాకృష్ణన్
భక్తితో సమర్పించిన పవిత్ర ద్రవ్యముతో ముద్రించబడినది

ప్రాప్తి స్థానము

**కె. నాదబాబు, కె. వంశీకృష్ణ,**
శ్రీలక్ష్మి జ్యూయలర్స్,
26-15-17/3, మెయిన్ రోడ్,
టౌన్ కొత్తరోడ్, **విశాఖపట్నం** - 530001
ఫోన్: 2502222,
సెల్: 99491 19222, 97040 59797

**శ్రీ త్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటము**
కురుపాం మార్కెట్, విశాఖపట్నం, ఆంధ్రప్రదేశ్.
సెల్: 94415 85685, 93923 85664, 98484 03356

# ముందుమాట

*శ్రీశః పాతు స్వస్తిభిః సదా నః.*

తత్త్వత్రయాత్మకమైన విశిష్టాద్వైతసిద్ధాంతంలో భగవంతుడైన శ్రీమన్నారాయణుడు సకలకళ్యాణగుణపూర్ణుడు. ఆ స్వామికి కల అనేకకల్యాణ గుణాలలో, దయ అనేది కూడా ఒకటి. ఇది, భగవచ్ఛబ్దాన్ని నిరూపించే ఆరు గుణాలలో ఒక గుణం అయిన జ్ఞానంయొక్క ప్రకారమే. "దయా పరవ్యసనహరా" అని ఈ దయాగుణాన్ని పరాశరభట్టర్ వారు నిర్వహించారు. స్వార్థం అనేది ఏ మాత్రం లేకుండా, ఇతరుల దుఃఖాన్ని సహించలేక, దానిని తొలగించాలనే ఇచ్ఛ కలిగిఉండడమే దయ అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ దయాగుణ కార్యాలే క్షమ, వాత్సల్యం మొదలైన గుణాలు. భగవంతుని అర్చామూర్తిలో సకలకళ్యాణగుణాలు పూర్ణంగా ఉంటాయని శాస్త్రం తెలుపుతున్నది. ఆళ్వారులు, ఆచార్యులుకూడా ఈ విధంగానే అనుగ్రహించారు. ఆయా దివ్యదేశాలలో వేంచేసి ఉండే భగవన్మూర్తులలో సమస్త కళ్యాణగుణాలు ప్రకాశిస్తూ ఉన్నప్పటికీ, ఒక్కొక్క దివ్యదేశంలో ఉండే ఒక్కొక్క మూర్తిలో ఒక్కొక్క కళ్యాణగుణం విలక్షణంగా ప్రకాశిస్తుందని ఆళ్వారుల అనుభవం, పూర్వాచార్యుల సిద్ధాంతం. ఈ క్రమంలో, తిరుమలలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వరునిలో వాత్సల్యగుణం విశేషంగా ప్రకాశిస్తూ ఉన్నదని నమ్మాళ్వారులు తాము శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణారవిందాలలో శరణాగతి చేసే సందర్భంగా "నిగరిల్ పుకళాయ్" (సాటిలేని కళ్యాణ గుణాన్ని కలిగినవాడా!) అని అంటూ సూచించారు. ఇక్కడ సాటి లేని కల్యాణ గుణం అంటే, వాత్సల్య గుణమే –అని మన పూర్వాచార్యుల అభిప్రాయం.

ఈ వాత్సల్యగుణానికి మూలం దయాగుణం. ఈ విధంగా శ్రీవేంకటేశ్వరునిలో విలక్షణంగా ప్రకాశించే వాత్సల్యగుణానికి మూలమైన దయాగుణాన్ని ఉద్దేశించి శ్రీవేదాంతదేశికులు దయాశతకం అనే 108 శ్లోకాలతో కూడిన ఒక అద్భుతమైన స్తుతిని అనుగ్రహించారు. ఈ స్తుతి ప్రపన్నులు నిత్యం అనుసంధించుకోదగిన స్తోత్రం. ఇందులో శబ్దప్రయోగచాతురి, అర్థంలోని మధురిమ సాటి లేనివి. ఈ స్తోత్రానికి ఇంతకుముందే పలువురు పలు భాషలలో చక్కని వ్యాఖ్యానాలను రచించారు. ప్రస్తుతం, ఈ స్తోత్రానికి నాతిసంగ్రహం, నాతివిస్తృతమైన వివరణ ఆస్తికలోకానికి సమర్పింపబడుతున్నది. మధురమైన విషయాన్ని ఎన్నిసార్లు అనుభవించినా తనివి తీరదు కదా. శ్రీ త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం, విశాఖపట్నంలో రామానుజుల సన్నిధిలో శ్రీదేవి, భూదేవి సమేత శ్రీవేంకటేశ్వరస్వామివారి విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవసందర్భంగా ఈ గ్రంథం ప్రకాశింపచేయబడుతున్నది. ఈ గ్రంథప్రకాశనానికి ఆవశ్యకమైన ద్రవ్యాన్ని పవిత్రమైన మనసుతో సమర్పిస్తున్న శ్రీమతి శ్రీమాన్ కరాలపాటి నాగబాబు, నాగమణి దంపతులు, మరియు, వారి కుటుంబ సభ్యులైన శ్రీమతి, శ్రీమాన్ కరాలపాటి వంశీకృష్ణ, నాగరేష్మా దంపతులు వారి కుమార్తె చిరంజీవి నైరాకృష్ణన్ తప్పక అభినందించదగినవారు. ఈ సందర్భంలో వారికి నా హృదయపూర్వకమైన మంగళాశాసనాలను అందజేస్తున్నాను. వీరిని ఈ గ్రంథ ప్రచురణలో ప్రోత్సహించిన మిత్రులు, శ్రీమాన్ కందాళ రాజగోపాలాచార్య స్వామివారు కూడా అభినందనీయులు. ఈ గ్రంథప్రచురణ ఆస్తికలోకానికి ఆనందాన్ని కలిగించగలదని నమ్ముతున్నాను. స్వస్తి.

భాగవత విధేయుడు,
ఈ. ఏ. సింగరాచార్యులు.

# దయాశతకం

శ్రీవేంకటేశ్వరస్వామికి గల కరుణ అనే గుణాన్ని గూర్చి కీర్తిస్తూ, 108 శ్లోకాలను కలిగిన కారణంచేత ఈ స్తోత్రానికి దయా శతకం అనే పేరును దేశికులు తామే స్వయంగా పెట్టారు. భగవంతునకు లెక్కలేనన్ని కళ్యాణ గుణాలు ఉన్నప్పటికీ, ఆ స్వామి యొక్క మిగిలిన గుణాలు కూడా అతిశయాన్ని పొందడం అనేది ఈ కరుణ అనే గుణంవల్లనే సంభవిస్తుంది కనుక, దీని ఔన్నత్యాన్ని పలుమార్లు ఈ స్తోత్రంలో శ్రీదేశికులు వ్యక్తం చేశారు. మిగిలిన గుణాలవలే కాకుండా, ఈ దయాగుణం చేతనులను కాపాడడం కోసమే ఉపయోగపడుతున్నది కనుక, దీనిని విషయంచేసి దేశికులు ఈ స్తోత్రాన్ని అనుగ్రహించారు.

ఇందులో ఉండే పది దశకాలు పలు విధాలైన వృత్తాలలో రచింపబడినందున అనుసంధానం చేసుకోవడంలో చాలా మధురంగా ఉంటాయి. భగవంతుని కరుణను భగవంతుని ఒక దివ్యపత్నిగా తమ మనస్సులో భావించి, ఆ దేవితో మాట్లాడే రీతిలో దీనిని రచించడం కూడా చాలా మధురమైనది శ్రీదేశికులు అనుగ్రహించిన ప్రతి గ్రంథం చాలా గొప్పతనాన్ని కలిగినది అయినప్పటికీ, ఈ స్తోత్రంలో ఉండే సన్నివేశం చాలా అద్భుతమైనది. సాటి లేని, అద్వితీయమైన క్రమంలో వెలుగుతున్నది. ఈ శతకంలో శ్రీదేశికులు ప్రపత్తిని గూర్చి మాటిమాటికి ప్రస్తావిస్తూ పలకడం దాని ఔన్నత్యం జనులు తెలుసుకొని, దానిని తాము కూడా గ్రహించడానికి వీలవుతున్నది. దీని చివరలో శ్రీవేంకటేశ్వరుడు

తానే వచ్చి తమను వేదాంతదేశికులుగా కీర్తిస్తూ బిరుదును ఇచ్చి, ఈ స్తోత్రాన్ని పాడించినట్లుగా దేశికులే స్వయంగా పలికారు. దీనిని ప్రతి దినం పారాయణం చేసేవారు శ్రీ వేంకటేశ్వరుని దివ్య కటాక్షానికి లక్ష్యమై సకల మంగళాలను పొందడం అనేది నిశ్చయం.

*1) ప్రపద్యే తం గిరిం ప్రాయః శ్రీనివాసానుకంపయా |*
*ఇక్షుసారస్రవంత్యేవ యన్మూర్త్యా శర్కరాయితమ్ ॥*

శ్రీ వేంకటాద్రిపై వేంచేసి ఉండే శ్రీనివాసుని అంతు లేని కరుణ భక్తులపై అంతు లేకుండా ప్రవహిస్తున్నది. ఆ కరుణ అనుభవించడానికి చాలా మధురమైనది చెరకు రసం తానే ఒక నదియై ప్రవహించినట్లు ఉన్నది. చెరకు రసం చివరిలో చక్కెరగా గట్టిపడి కలకండగా అవడం కదా సహజం. శ్రీనివాసుని కరుణాగుణం అనే నదీప్రవాహం అనేది చెరకు రసప్రవాహం. ఈ శ్రీ వేంకటపర్వత రూపాన్ని పొందిన చక్కరయై, ఇంకా ఘనమై గట్టిపడి, అందరూ అనుభవించడానికి వీలుగా ఉన్నది. ఈ కరుణయే ఈ తిరుమల రూపంగా ప్రకాశిస్తున్నది కరుణ భగవంతుని గుణాలలో చాలా గొప్పది భక్తుల దోషాలను సహించడం అనే స్వభావాన్ని కలిగినది. వారు కోరిన ప్రయోజనాలను అన్నిటినీ ఇచ్చే స్వభావాన్ని కలిగినది. నదీప్రవాహంవలె కదపడానికి సాధ్యం కానిది. చలించనిది ఇటువంటి కరుణయే మూర్తీభవించి తిరుమలగా అయినది. దీనిని నేను శరణు పొందుతున్నాను.

**2) విగాహే తీర్థబహుళాం శీతళాం గురుసంతతిమ్ |**

**శ్రీనివాసదయాంభోధి పరీవాహపరంపరామ్ ॥**

నేను ఆరంభించిన ఈ స్తుతి ఎటువంటి ఆటంకాలు లేకుండా పూర్తి కావడం కోసం ఆచార్యపరంపరను మొదట సేవిస్తున్నాను. జలాశయం లో నీరు నిండి పోతే, అందులో నుండి పొంగిపొర్లే నీటిని బయటకు ఏదో విధంగా విడచి పెట్టాలి. శ్రీ వేంకటేశ్వరుని కరుణ సముద్రం వంటి ఒక చాలా పెద్ద జలాశయం. అది పొంగిపొర్లి ఆచార్య పరంపర రూపంలో ప్రవాహంగా బయటకు వచ్చింది. ఆ పూర్ణమైన, నిండుగా ప్రవహించే, శ్రీవేంకటేశ్వరుని కరుణ అనే సముద్రంలో దిగి స్నానం చేసే రేవులుగా పలువురు ఆచార్యులు ఉన్నారు. వారి పరంపర జీవుల విషయంలో మిక్కిలి చల్లని మనసును కలిగినది. ఆచార్యుల అనే రేవులలో దిగి, లోతుగా ఆ వేంకటేశ్వరుని కరుణ అనే సముద్రంలో నేను స్నానం చేస్తున్నాను. రేవులే లేకపోతే, సముద్రంలో దిగి స్నానం చేయడం వీలు కాదు. ఆ విధంగానే, ఆచార్యులే లేకపోతే భగవంతుని కరుణను పొందడం సాధ్యం కాదు.

**3) కృతినః కమలావాస కారుణ్యైకాంతినో భజే |**

**ధత్తే యత్సూక్తిరూపేణ త్రివేదీ సర్వయోగ్యతామ్ ॥**

శ్రీవేంకటేశ్వరుని కరుణనే శరణంగా ఆశ్రయించినవారు నమ్మాళ్వార్లు మొదలైన ఆళ్వారులు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అనే మూడు వేదాలు బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులు,

అనే మూడు విధాలయిన జాతులవారే అధ్యయనం చేయడానికి సాధ్యమైనవి. అరుదైన ఆ వేదాల అంతరార్ధాలను అన్ని జాతులవారు గ్రహించి తరించాలి కదా. అందుకోసం అళ్వార్లు చాలా కరుణతో వేదార్ధాలను పొందుపరచి, దివ్యప్రబంధాలను లోకానికి అనుగ్రహించి, అందర జీవులను ఉజ్జీవింప చేశారు. ఈ విధంగా మూడు వేదాలను కలిపి చేర్చి, ద్రావిడ వేదరూపంలో అనుగ్రహించిన అళ్వార్లను నేను భజిస్తున్నాను.

**4) పరాశరముఖాస్ వందే భగీరథనయే స్థితాస్ |**

**కమలాకాంతకారుణ్య గంగాప్లావితమద్విధాస్ ॥**

భగీరథుడు అనే రాజు గొప్ప తపస్సు చేసి, స్వర్గలోకంలో ఉండే గంగను ఈ భూలోకానికి తీసుకొని వచ్చాడు. కపిల ముని శాపంచేత భస్మమైపోయిన తన తాత ముత్తాతల భస్మాన్ని ఆ గంగాజలంతో తడిపి, వారికి మంచి గతిని కలిగేటట్లు చేశాడు. పరాశర మహర్షి, వ్యాసమహర్షి, వాల్మీకి మహర్షి మొదలైనవారు ఆ భగీరథునివంటివారు. మనం పాపాలను చేసి, మన ఆత్మలను పాడు చేసుకుని బాధపడుతున్నాము. ఆ మునులు శ్రీ విష్ణుపురాణం, మహాభారతం, శ్రీమద్రామాయణం మొదలైన గొప్ప గ్రంథాలను రచించారు. వారి ప్రయత్నం రూపాలైన ఆ గ్రంథాలను మనం చదివి, మనం సంస్కారాన్ని పొందుతున్నాము. అందువల్ల శ్రీనివాసుని కరుణ అనే గంగా ప్రవాహం మన మీద

ప్రవహిస్తున్నది. మనం మంచి గతిని పొందుతున్నాము. ఈ విధంగా మనలను రక్షించిన ఈ మునులను నమస్కరిస్తున్నాను.

**5) అశేషవిఘ్నశమనం అనీకేశ్వరమాశ్రయే |**
**శ్రీమతః కరుణాంభోధౌ శిక్షాస్త్రోత ఇవోత్థితమ్ ॥**

చాలా పెద్ద సముద్రంవంటి జలాశయాలు నీటితో నిండి పోగా, ఆ జలాశయాలలో ఉండే నీరు బయటకు కాలువల రూపంలో ప్రవహించడాన్ని మనం గమనిస్తున్నాము. శ్రీనివాసుని కరుణయే ఒక పెద్ద సముద్రం. దాని నుండి ప్రవహించే నీటి ప్రవాహాలు అనేకం. వాటిలో తప్పు చేస్తే దండించడం నియమించడం మొదలైనవికూడా అంతర్భవించి ఉన్నాయి. ఆ విధంగానే, ఉపదేశించడం ఒక ప్రవాహమే. అదే విష్వక్సేనుల రూపాన్ని పొందింది. భగవంతుడు తనకు సంబంధించిన అన్ని కార్యాలను విష్వక్సేనుల వద్ద అప్పగించి, వారి ద్వారా అన్ని కార్యాలను నిర్వహిస్తున్నాడు. భగవంతుని సేనకు ఆ విష్వక్సేనుడు నాయకుడు, కనుక సేనాపతి, సేనై మొదలియార్ అని ఈ విధంగా పలువబడుతున్నాడు తప్పులు చేసినవారిని దండించే స్వభావాన్ని కలవాడు, ఆయన. ఈ విధంగా ఆయన గండించడం కూడా, తప్పు చేసినవారిని సంస్కరించడం కోసం ఉపయోగపడుతున్నది అందుచేత, దండించే భగవంతుని కరుణ యొక్క కార్యమే ఇది. అంతేకాక, వారు వారు చేసే మంచి కార్యాలకు ఏర్పడే ఆటంకాలను అన్నిటిని విష్వక్సేనుడు తీరుస్తున్నాడు. అందువల్లనే అన్ని సత్కార్యాలకు

ఆరంభంలోనే విష్వక్సేనునకు ఆరాధన చేయబడుతున్నది. ఈ విధంగా భగవంతుని గొప్పతనాన్ని కలిగిన విష్వక్సేనులను నమస్కరిస్తున్నాను.

**6) సమస్తజననీం వందే చైతన్యస్తన్యదాయినీమ్ |**
**శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివ రూపిణీమ్ ॥**

లోకంలో, తల్లి, తన బిడ్డకు తన సన్యాన్ని ఇచ్చి పెంచుతుంది. లక్ష్మీదేవి తత్త్వాలను గూర్చిన జ్ఞానం అనే స్తన్యాన్ని ఇచ్చి, తన బిడ్డలమైన మనలను మంచి గతిని పొందేటట్లు చేస్తున్నది. అందుచేత, లోకానికి తల్లియై ఆమె ప్రకాశిస్తున్నది. ఈ విధంగా ఉండే ఆమె స్వభావాలను గూర్చి భావించినప్పుడు, శ్రీ వేంకటేశ్వరుని కరుణ అనే గుణమే ఈ లక్ష్మీదేవి రూపాన్ని పొందిందా! అని భావించే అవకాశం ఉన్నది. ఇటువంటి లక్ష్మీదేవిని నేను నమస్కరిస్తున్నాను.

**7) వందే వృషగిరీశస్య మహిషీం విశ్వధారిణీమ్ |**
**తత్కృపాప్రతిఘాతానాం క్షమయా వారణం యయా ॥**

లక్ష్మీదేవికి తరువాత, భూదేవి కూడా భగవంతుని దివ్యమహిషియై ప్రకాశిస్తున్నది. ఆమె లోకాన్ని అంతటినీ ధరిస్తున్నది. ఈమె, క్షమాగుణమే మూర్తీభవించినది కనుక, తప్పులను అన్నిటిని సహించే స్వభావాన్ని తెలిపే క్షమా అనే పదంతో పిలువబడుతున్నది. జీవులు అనేక పాపాలను చేస్తున్నారు. అందుచేత భగవంతుని కరుణయొక్క ప్రవాహం వారిచే అడ్డగింపబడుతున్నది. అప్పుడు భూదేవి

వారి దోషాలను భగవంతుడు క్షమించేటట్లు చేసి, ఆ శ్రీనివాసుని కరుణ అడ్డు లేకుండా వారి మీదకు ప్రవహించేటట్లు చేస్తున్నది. ఇటువంటి భూదేవిని నేను నమస్కరిస్తున్నాను.

**8) నిశామయతు మాం నీళా యద్భోగపటలై ర్ధ్రువమ్ |**

**భావితం శ్రీనివాసస్య భక్తదోషేష్వదర్శనమ్ ॥**

ఇంతకు ముందు ప్రస్తావించిన లక్ష్మీదేవి, భూదేవి అనే ఈ ఇద్దరి కంటే నీళాదేవికి భగవంతుని వ్యామోహపరిచే సామర్థ్యం ఎక్కువగా ఉన్నది. శ్రీ వేంకటేశ్వరుని దగ్గర నీళాదేవి పలు విధాలైన శృంగారాలను ప్రదర్శిస్తున్నది. ఈ కార్యాలు ఎందుకోసం అంటే, భక్తులను రక్షించడం కోసమే. ఈమె ప్రదర్శించే లీలలలో శ్రీనివాసుడు మిక్కిలిగా వ్యామోహాన్ని పొందుతున్నాడు. కంటిలో దోషం ఉంటే వస్తువులను చూడడం సాధ్యం కాదు. నీళాదేవి లీలలు భగవంతుని నేత్రాలకు ఏర్పడిన దోషాల వంటివి. వీటి వల్ల భగవంతుడు గమనించే శక్తిని కోల్పోయినవాడుగా అవుతున్నాడు. అంటే, నీళాదేవి లీలలలో భగవంతుడు మైకాన్ని పొంది, భక్తుల దోషాలను కంటితో చూడడమే లేదు. అందుచేత, ఎటువంటి పాపిని అయినా భగవంతుడు రక్షించేటట్లు చేసి, ఆమె కాపాడుతున్నది. ఈ విధంగా భక్తులను అనుగ్రహిస్తున్న నీళాదేవి నన్ను కటాక్షించాలి.

**9) కమప్యనవధిం వందే కరుణావరుణాలయమ్ |**

**వృషశైలతటస్థానాం స్వయం వ్యక్తి ముపాగతమ్ ॥**

శ్రీనివాసుని దగ్గర ఉండేవారు ఏనాడు అయినా అనుభవించేటట్లుగా ఒక సముద్రం తానుగానే వచ్చి ఆవిర్భవించింది. ఈ సముద్రంలో ఉండే నీరు కరుణయే. ఇదే శ్రీ వేంకటేశ్వరుడు అనే ఆశ్చర్యకరమైన కరుణాసముద్రం. ఇది, దేశ –కాల– వస్తుపరిచ్ఛేదాలను లేనిది. ఇటువంటి ఈ సముద్రాన్ని నమస్కరిస్తున్నాను.

**10) అకించననిధిం సూతిమ్ అపవర్గత్రివర్గయోః |**

**అంజనాద్రీశ్వరదయాం అభిష్టౌమి నిరంజనామ్ ॥**

లోకంలో ఉండే బీదవారికి ఏదైనా ఒక నిధి లభిస్తే, దాని వల్ల వారు చాలా విధాలైన హితాలను పొందుతారు. భూమిలో కింద ఉండే నిధిని కంటిలో మహిమ కలిగిన కాటుక పెట్టుకుని చూసినప్పుడే తెలిసిపోవడం వీలవుతుంది. వేంకటాచలానికి అంజనపర్వతం అనే ఒక పేరు ఉన్నది. ఈ పర్వతానికి నాథుడైన శ్రీనివాసుని కరుణ ఒక అపూర్వమైన నిధివంటిది. ఈ కరుణవల్ల మంచిని పొందాలని కోరేవారు కఠినమైన భక్తియోగం మొదలైన పేరు ఉపాయాలను చేయలేనివారై, ప్రపత్తిని ఉపాయంగా గ్రహిస్తున్నారు. చేతనులు ఈ కరుణను పురస్కరించుకొని ధర్మార్థ కామ మోక్షాలు అనే నాలుగు విధాలైన పురుషార్థాలను వారి మనోరథాలకు తగినట్లుగా పొందుతున్నారు. ఈ కరుణ ఎటువంటి దోషం లేనిది. భక్తుల విషయంలో తారతమ్యాలను చూడడం అనే దోషాన్ని లేనిది, ఈ కరుణ. జాతిభేదం, హెచ్చుతగ్గులు

మొదలైనవానిని చూడకుండా, అందరి విషయంలో సమానంగా ప్రవహించి రక్షిస్తున్నది. ఇటువంటి శ్రీనివాసుని కరుణ కీర్తిస్తున్నాను.

అంజనాచల ప్రభువు దయకు అంజనం లేదు –అని అనడం ఒక సరసమైన ఉక్తి.

**11) అనుచరశక్త్యాదిగుణామ్ అగ్రేసరబోధవిరచితాలోకామ్ |**
**స్వాధీనవృషగిరీశాం స్వయం ప్రభూతాం ప్రమాణయామి దయామ్ ॥**

ఒక పట్టమహిషి బయటకు వచ్చినప్పుడు, ఆమెకు ముందు ఒకడు దివిటీని పట్టుకొని వెడతాడు. ఆమె పరివారాలు ఆమెకు వెనకాల వెడతాయి. తన నాయకుడైన మహారాజు కూడా తనకు వశమై ఆమె వెంట వస్తాడు. అటువంటి ఆమెకు మించినవారు ఎవరు ఉండరు. ఆమె గొప్ప దేవేరిగా వెలుగుతుంది. ఆ విధంగానే, శ్రీవేంకటేశ్వరునకు కరుణ అనేది ఒక దివ్యపత్ని. ఈమె, దుఃఖాన్ని కలిగిన ఒకనిని రక్షించాలని ప్రయత్నించినప్పుడు, భగవంతుని ముఖ్య గుణాలు అయిన జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు అనే ఆరు గుణాలలో, జ్ఞానం అనే గుణం దయా దేవికి ముందుగా వెళుతూ, "జయ జయ" అని జయ ఘోషాన్ని పలుకుతూ, దీపాన్ని చూపిస్తూ ఉన్నదట. ఆమెకు వెనకాల మిగిలిన ఐదు గుణాలు ఆమెను అనుసరిస్తూ వెళుతున్నవట. ఈ విధంగా గొప్పతనాన్ని కలిగిన దయాదేవి శ్రీవేంకటేశ్వరుని తన వశం చేసుకున్నది. ఈమెకు మించినవారు ఎవరు లేరు. ఈమె గొప్ప

నాయకియై వెలుగుతున్నది. నన్ను రక్షించడం అనే భారాన్ని ఈ కరుణాదేవి మనసుకు విడచి పెట్టాను.

శ్రీనివాసుడు తన దయతో చేతనులను రక్షించేటప్పుడు, ముందుగా వారి దుఃఖస్థితిని తన జ్ఞానం అనే గుణంతో తెలుసుకొని, తరువాత, శక్తి, బలం మొదలైన గుణాలతో రక్షిస్తాడు– అని ఇక్కడ తాత్పర్యం.

**12) అపి నిఖిలలోకసుచరిత ముష్టింధయదురితమూర్ఛనాజుష్టమ్|**
**సంజీవయతు దయే మామ్ అంజనగిరినాథరంజనీ భవతీ ॥**

లోకంలో జ్వరం మొదలైనవాని ప్రకోపంవల్ల మూర్ఛను పొంది బాధపడే తన పుత్రునకు అతని తల్లి గొప్ప వైద్యుని పిలచి, పర్వతంలో మొలిచే పచ్చి ఆకులతో మందును చేయించి, అతనికి మూర్ఛను పోగొట్టి, వ్యాధిని తీర్చి ఆరోగ్యాన్ని పొందేటట్లు చేయడం చూస్తున్నాము. దయాదేవీ! నీవే దాసునకు తల్లివి. నేను నీ పుత్రుడను. నన్ను రక్షించడం నీ బాధ్యత. నేను చేసిన పాపాలకు అంతులేదు. లోకంలో ఉండే జనులందరికీ పుణ్యాలను, నా పాపాలను గమనించి, వాటిని తూచి చూస్తే, నా పాపాల ఆధిక్యం బాగా తెలుస్తుంది. వారి పుణ్యాలను అన్నిటినీ ఒక పిడికిలితో గ్రహించి మింగి వేయగలిగినవి, ననా పాపాలు. ఇటువంటి ఘోరమైన పాపాలతో మతిని కోల్పోయి నేను మూర్ఛ పొంది ఉన్నాను. ననీ నాయకుడైన శ్రీనివాసుడు శ్రీ వేంకటాద్రిపై నివసిస్తున్నాడు. పచ్చి

ఆకులకు నిలయం ఈ పర్వతం. శ్రీనివాసుడు సంసారం అనే వ్యాధిని తీర్చే గొప్ప వైద్యుడు. నీ స్వభావం చేత, కృత్యాల చేత నీవు అతనిని ఆనందింప చేస్తున్నావు. అతడు నీ మాటను జవదాటడు. అతని ద్వారా నీవు నా పాపాలను పోగొట్టి, నా మనసుకు కలిగిన మైకాన్ని తీర్చి, నన్ను తరింపజేసి, నేను ఉజ్జీవనాన్ని పొందేటట్లు నీవు చేయాలి.

**13) భగవతి దయే భవత్యా వృషగిరినాథే సమాప్లుతే తుంగే|**

**అప్రతిఘమజ్జనానాం హస్తాలంబో మదాగసాం మృగ్యః॥**

చాలా గొప్పతనాన్ని కలిగిన దయాదేవీ! శ్రీవేంకటేశ్వరుడు వేంకటాచలంపై ఉన్నతమైన చోట నివసిస్తున్నాడు. ఆ స్వామిని కూడా నీవు నీ ప్రవాహంలో మునిగిపోయేటట్లు చేస్తున్నావు. ఆ విధంగా ఉండగా, నా పాపాలు నీ ప్రవాహంలో మునిగి పోవడంలో అడ్డు ఏమున్నది? ఆ వేంకటేశ్వర స్వామియే నీ ప్రవాహంలో మునిగిపోయి తడబడేటప్పుడు, అతడు మనస్సులో భావించే నా పాపాలు కూడా అతనితో చేరి నీ ప్రవాహంలో మునిగిపోకుండా ఉంటాయా? అందుచేత, నా పాపాలకు చేయూతను ఇచ్చి ఒడ్డును చేర్చేవారు ఎవరూ లేరు.

శ్రీ వేంకటేశ్వరుని గుణాలలో నీవే ప్రాధాన్యాన్ని పొందినందువల్ల, నీ చేత తడుపబడిన ఆ స్వామి నన్ను చల్లగా కటాక్షించి నా పాపాలను తీర్చి, నన్ను రక్షిస్తాడు –అనేది ఇక్కడ తాత్పర్యం.

**14)కృపణజనకల్పలతికామ్ కృతాపరాధస్య నిష్క్రియామాద్యామ్ |**
**వృషగిరినాథదయే త్వాం విదంతి సంసారతారిణీం విబుధాః ॥**

శ్రీవేంకటేశ్వరుని కరుణా దేవీ! భక్తి యోగం మొదలైన కఠినమైన ఉపాయాలను చేయలేనందువల్ల వేరు ఏ ఉపాయం లేనివారై, నిన్ను జీవులు శరణు పొందుతున్నారు. వారికి నీవు కల్పలతవలె నిలచి, వారు కోరే అన్ని ప్రయోజనాలను అనుగ్రహిస్తున్నావు. క్రూరమైన పాపాలను చేసే చేతనులకు కఠినమైన ప్రాయశ్చితాలు శాస్త్రాలలో విధింపబడ్డాయి. అతడు వాటిని నేరుగా చేసి పూర్తి చేయడంలో నీ సహాయం ఆవశ్యకమై ఉన్నది. ఆ విధంగా కఠినమైన ప్రాయశ్చితాలను చేయలేనివానికి ఆ భారాన్ని నీవే మోస్తున్నావు. నీవే ప్రధానమైన ప్రాయశ్చిత్తంగా నిలచి అతనికి పవిత్రతను కలిగించి అనుగ్రహిస్తున్నావు. నీకు కల ఈ గొప్పతనాలను అన్నిటినీ భావించి, మహాజ్ఞానులైన ఆచార్యులు సంసార సముద్రంలో మునిగినవానిని నీవే ఒడ్డును చేర్చగలిగినదానవు– అని నిశ్చయించుకుంటున్నారు.

**15) వృషగిరిగృహమేధిగుణాః బోధబలైశ్వర్యవీర్యశక్తి ముఖాః |**
**దోషా భవేయురేతే యది నామ దయే త్వయా వినాభూతాః ॥**

దయాదేవీ! లోకం అంతా తన కుటుంబంగా కలిగిన శ్రీనివాసుడు వేంకటాద్రిపై దివ్యదేవేరితో కలసి గృహస్థ జీవనాన్ని గడుపుతున్నాడు. అతనికి ఉండే లెక్కలేనన్ని కళ్యాణ గుణాలలో ముఖ్యమైనవి ఆరు. అవి ఏమంటే, జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనేవి. ఈ ఆరు

గుణాలను కలిగి ఉన్నందువల్లనే అతడు భగవంతుడు అని అనబడుతున్నాడు. ఆ గుణాలు అతని దగ్గర, నీ దగ్గర చేరి ఉన్నందువల్లనే అవి మంచి మార్గంలో ఉపయోగపడే గుణాలు అనే గొప్పతనాన్ని పొందుతున్నాయి. నీవు మిగిలిన గుణాలతో కలవకపోతే, ఆ గుణాలు చేతనులకు భగవంతుడు దండన అనే హానిని చేయడానికి ఉపయోగపడతాయి కనుక, అవి దోషాలుగానే కాగలవు. ఉదాహరణకు, జ్ఞానం, బలం మొదలైన గుణాలు చేతనుల దగ్గర ఉండే దోషాలను చూస్తే, వారిని బాగా దండించడం మొదలైన కార్యాలకు ఉపయోగపడతాయి. అందుచేత, ఆ గుణాలు దోషాలు గానే అయిపోతాయి. దయాదేవి అయిన నీవు వాటితో కూడి ఉన్నట్లయితే, నీ గొప్పతనం అతిశయించి ఉంటుంది కనుక, ఆ గుణాలు అన్ని నీ పక్కకు చేరి, చేతనులను కాపాడడానికి సహాయపడతాయి. ఇటువంటి గొప్పతనం వల్లనే భగవంతుని అన్ని గుణాలలో నీవు చాలా ప్రధానమైన గుణమై ప్రకాశిస్తున్నావు.

**16) ఆసృష్టిసంతతానామ్ అపరాధానాం నిరోధినీం జగతః |**
**పద్మాసహాయకరుణే ప్రతిసంచరకేళిమాచరసి ॥**

శ్రీనివాసుని దయాదేవీ! సృష్టి కాలంనుండి ఆరంభించి లోకంలో ఉండే జీవులు చేస్తూ వచ్చే పాపాలకు అవధి అనేది లేదు. వారు పాపకార్యాలను చేయడం నుండి కొంచెం కూడా నివర్తించడం లేదు. ఆ విధంగానే జరిగితే, వారు మంచి గతని పొందే దారి ఏది? వారు పాప కార్యాలు చేస్తూనే ఉండడాన్ని నిలుపు చేయాలని నీవు మనస్సులో

భావించి, ప్రళయం అనే ఒక లీలను ఏర్పరచావు. జీవులకు శరీరం, ఇంద్రియాలు మొదలైన లేకుండా చేసి, వారిని నిద్రాదశలో ఉండే విధంగా చేసి, జడ వస్తువులనువలె చేస్తున్నావు. అప్పుడు పాపం చేయడానికి వారికి అవకాశం ఉండదు కదా. నిరంతరంగా సుఖదుఃఖాలను అనుభవిస్తూ వచ్చే శ్రమ అనేదికూడా వారికి తీరిపోతుంది. రంతరంగా పాపాలను చేయడం అనే అలవాటు కూడా అడ్డగింపబడుతుంది. ఈ క్రీడ కూడా వారి విషయంలో మంచి అభిప్రాయంతోనే చేసిన కార్యమే అవుతున్నది. లోకంలో తల్లులు తమ బిడ్డలు చాలా కాలం చెడ్డ పనులను చేస్తూ వచ్చినట్లయితే, దానివల్ల ఏర్పడే శ్రమ, హాని తీరడం కోసం, ఆ కార్యాలను కొంచెం సేపు ఆ బిడ్డలు చేయకుండా మరచి పోవడం కోసం, బలవంతంగా వారిని నిద్రపుచ్చుతారు. ఆ బిడ్డలు కూడా ఆ కార్యాలను చేయడం అప్పుడు మరచిపోయి నిద్రపోతారు. నిద్రలేచిన తరువాత ఆ పాపకార్యాలను చేయడం మరిచిపోతారు. ఆ విధంగానే, నీవు ప్రళయం అనే లీలను చేసి, జీవులను వారు పాపకార్యాలనుండి నివర్తించేటట్లు చేస్తున్నావు.

**17) అచిదవిశిష్టాన్ ప్రళయే జంతూనవలోక్య జాతనిర్వేదా!**
**కరణకళేబరయోగం వితరసి వృషశైలనాథకరుణే త్వమ్ ॥**

శ్రీ వేంకటేశ్వరుని దయా దేవీ! ప్రళయ కాలంలో సకల ప్రాణులకు శరీరం అనేది ఉండదు. ఇంద్రియాలు ఉండవు. వారి జ్ఞానం ఆవరింపబడి ఉంటుంది. ప్రాణులు ఏ కార్యాన్ని చేయడానికి తగిన యోగ్యత లేకుండా,

ఆచేతన వస్తువులపలె పడి ఉంటారు. వారి ఈ స్థితిని చూచి నీ మనసు చాలా బాధపడుతుంది. వారిని ఈ స్థితిలోనే ఉంచినట్లయితే వారు తరించడం ఏ విధంగా? అనే చింతను నీవు పొందుతావు. వారికి మళ్ళీ శరీరాన్ని ఇస్తావు. ఇంద్రియాలను కూడా ఇస్తావు. తరువాత వారు స్పష్టమైన జ్ఞానాన్ని నీ అనుగ్రహం వల్ల పొందుతారు. ఈ విధంగా వారు వివేకంతో మంచి మార్గంలో ప్రవేశించి నడవడానికి కావలసిన యోగ్యతను నీవు కలిగిస్తున్నావు. ఇవి అన్ని ఈ కార్యాలే. లోకంలో దుష్ట కార్యాలను చేసే బిడ్డలను నిద్ర పోయేటట్లు చేస్తుంది, తల్లి. వారు ఆ దుష్ట కార్యాలు చేయడం మాని నిద్రపోయేటప్పుడు ఆమె వారిపై జాలిని పొంది, తరువాత వారిని నిద్రలేపి, వారికి కావలసిన తినుబండారాలను మొదలైన వాటిని ఇచ్చి, మళ్ళీ చెడ్డ కార్యాలను చేయకుండా ఉండేటట్లు మంచి మాటలను చెబుతుంది. అందుచేత ప్రళయం కూడా కరుణ వల్ల ఏర్పడుతున్నది. సృష్టి కూడా కరుణ వల్లనే ఏర్పడే కార్యం అని తెలుస్తున్నది.

**18) అనుగుణదశార్పితేన శ్రీధరకరుణే సమాహితస్నేహా |**
**శమయసి తమః ప్రజానాం శాస్త్రమయేన స్థిరప్రదీపేన ॥**

శ్రీనివాసుని దయాదేవీ! లోకంలో చీకటిలో దారి తెలియక తడబడకుండా ఉండడం కోసం దీపాన్ని వెలిగించి పెడతారు. ఆ వెలుగులో జనులు చెడ్డ మార్గంలో వెళ్లి బాధపడకుండా, సరైన మార్గంలో ప్రయాణించడానికి వీలవుతుంది. నీవు లోకానికి అంతటికి తల్లివి కదా. జనులందరూ ఈ బిడ్డలే. నీవు వారి విషయంలో కలిగి ఉండే ప్రేమయే

నీవు ఇచ్చే దీపానికి నూనె అవుతున్నది. వారికి సమయంలో తల ఎత్తే మంచి గుణమే వత్తి అవుతున్నది. నీవు వ్యక్తం చేసే వేదాలు మొదలైన శాస్త్రాలు వారికి ఇచ్చే శాశ్వతమైన దీపం అవుతున్నది. వారి అజ్ఞానమే నీవు వెలిగించిన దీపం వల్ల తొలగిపోయే చీకటి అవుతున్నది. జనులకు మంచి గుణం కలిగించే సమయం చూసి మిక్కిలి ప్రేమతో నీవు వ్యక్తం చేసే శాస్త్రాల అర్థం వారు తెలుసుకొని, తమ అజ్ఞానం తీర్చుకొని చక్కని స్పష్టమైన జ్ఞానాన్ని పొంది, చెడ్డ కార్యాలను చేయకుండా మాని, ఋజువైన దారిలో నడచి, వారు తరించేటట్లు చేస్తున్నావు. సృష్టింపబడిన జనులకు శాస్త్రమనే దీపాన్ని ఇవ్వడం కూడా దయాకార్యమే అని తెలుస్తున్నది.

**19) రూఢా వృషాచలపతేః పాదే ముఖకాంతిపత్రళచ్ఛాయా |**
**కరుణే సుఖయసి వినతాన్ కటాక్షవిటపైః కరాపచేయఫలైః ॥**

పర్వతంపై ఒక వృక్షం ఒలిచి పెరుగుతున్నది దాని శాఖలలో ఉండే ఆకులు పచ్చగా దట్టంగా ఉన్నాయి అందువల్ల ఆ వృక్షం అందాన్ని పొంది చల్లని నీడను ఇస్తున్నది దాని కొమ్మలలో పండిన పళ్ళు వేలాడడం వల్ల ఆ చెట్టు చేతికి అందే ఎత్తులో ఉన్నది తమ చేతులతో కొమ్మలను వంచి, ఆ పండ్లను కోసి భుజించి ఆనందించటానికి వీలుగా ఉంటుంది.

శ్రీనివాసుని దయాదేవీ! శ్రీవేంకటాచలంపై శ్రీనివాసుని కరుణ అనే నీవు ఉన్నతంగా నిలచి ఉన్నావు. అందువల్ల నీవు అతని పాదాలలో

పుట్టి పెరిగి ప్రకాశించే కల్పవృక్షం వలె ఉన్నావు. ఆశ్రయించిన వెంటనే జనుల విషయంలో ఆ స్వామికి కలిగే ఆనందంచేత ఆ స్వామి ముఖ మండలంలో ఏర్పడిన పచ్చదనం మిక్కిలి అందాన్ని కలిగిస్తున్నది. వర్ణమే ఈ కల్పవృక్షంలో ఉండే పచ్చదనమే పచ్చని లేత ఆకులను దట్టంగా కలిగి ఉండడం. దీనివల్ల ఆ కల్పవృక్షం అందాన్ని పొందుతున్నది. జనుల విషయంలో శ్రీనివాసునకు ఏర్పడే కటాక్షాలే ఆ కల్పవృక్షంలోని శాఖలు. ఆ కటాక్షాల వల్ల లభించే ఫలాలు అన్నీ పండిన తీయని పళ్ళు. ఆ స్వామిని నమస్కరించేవారు ఆ ఫలాలను ఏ విధమైన అలసట లేకుండా సులభంగా పొందడమే సులభంగా చేతులతో ఆకల్ప వృక్షంలోని పండ్లను కోయడంవంటిది అవుతున్నది.

శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో జనులు నమస్కరించిన వెంటనే, అతని కరుణ అనే నీవు ఆ స్వామి వద్ద నిండుగా ప్రకాశిస్తున్నావు. అపుడు అతని ముఖమండలంలో వికాసం గొప్పగా ప్రకాశిస్తుంది. వెంటనే అతడు భక్తులను చల్లగా చూస్తాడు. అందువల్ల వారు కోరిన ప్రయోజనాలను అన్నిటిని సులభంగా పొంది ఆనందిస్తున్నారు. ఇంతటి అతిశయానికి నీవే కారణమై ఉన్నావు– అని భావం.

**20) నయనే వృషాచలేందోః తారామైత్రీం దధానయా కరుణే |**
**దృష్ట స్త్వయైవ జనిమాన్ అపవర్గమకృష్ణపచ్యమనుభవతి ॥**

శ్రీనివాసుని దయాదేవీ! శ్రీ వేంకటాచలంపై అందరి కన్నులకు ఒక చక్కని విందుగా ఒక పూర్ణ చంద్రునివలె శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం

ఇస్తున్నాడు. అతడు తన నేత్రాలతో జనులను చల్లగా కటాక్షించాలి అని నీవు కోరుతున్నావు. అందుకోసం అతని కంటిలో నీవు అమరి ఉండి, అతనికి జనుల విషయంలో ప్రేమ కలిగేటట్లు చేస్తున్నావు. దీనికి కూడా కారణంగా చేతనులు పుట్టేటప్పుడే అతనడు వారిని కటాక్షించేటట్లు నీవు చేస్తున్నావు. ఇదే కదా జాయమాన కటాక్షం అని చెప్పబడుతున్నది. దీనివల్ల ఆ జనుడు ఆచార్య సంబంధాన్ని పొంది, మంచి జ్ఞానాన్ని, వివేకాన్ని పొంది, శాస్త్ర క్రమానుసారంగా శ్రీనివాసుని శ్రీచరణాలలో ప్రపత్తిని చేస్తున్నాడు. దీనివల్ల శ్రీనివాసుడు చల్లగా కటాక్షించి అతడు భక్తి యోగం మొదలైన కఠినమైన ఉపాయాలను చేయనక్కర లేకుండా ఉండేటట్లు, ఆ స్థానంలో తానే నిలచి, ఇంతవరకు మోక్షం ఇవ్వడానికి వ్యతిరేకంగా ఉండే తన సంకల్పాన్ని మార్చుకుంటాడు. చేతనుడు తరువాత ఇక ఏమీ చేయనక్కరలేకుండా ఉండేటట్లు అతనికి మోక్షాన్ని ఇచ్చి, ఆ ఆనందాన్ని అతడు అనుభవించేటట్లు చేస్తున్నాడు. ఎక్కువ ప్రయాస పడవలసిన ఆవశ్యకత అనేది ఏమి లేకుండా, ఉండే చోటులోనే కొద్దిపాటి ప్రయత్నాన్ని చేసి, ఆ చోట ఫలించే గొప్ప ఫలాన్ని పూర్ణంగా పొందే ఒక అదృష్టవంతునివలె అతడు ఆచరించటానికి చాలా కఠినమైన భక్తి యోగాన్ని చేసే ప్రయాస ఏమీ లేకుండా, సులభంగా ఉండే ప్రపత్తిని చేసి, నిత్యమైన మోక్షానందాన్ని అనుభవిస్తున్నాడు. దీనికి నీవే కదా మొదటి కారణమై ఉన్నావు.

చంద్రుడు తారతో స్నేహాన్ని కలిగి ఉన్నందున బుధుడు జన్మిస్తున్నాడు అనే విషయం "ఇందు, తారమైత్రీ, జనిమాన్" అనే పదాలవల్ల ధ్వనించే స్వారస్యం ఇక్కడ గమనించదగినది.

**21) సమయోపనతైస్తవ ప్రవాహైః అనుకంపే కృతసంప్లవా ధరిత్రీ |**
**శరణాగతసస్యమాలినీయం వృషశైలేశకృషీవలం ధినోతి ||**

దయాదేవీ! లోకంలో వ్యవసాయదారుడు తన భూమిని పెద్ద ప్రయత్నంతో దున్ని, ప్రయత్నం చేసి విత్తనాలను జల్లి పంటను పెంచుతాడు. అతడు మంచి పంట కోసం నదీజలప్రవాహాన్ని ఆసక్తితో ఎదురుచూస్తాడు. తగిన సమయంలో నదీప్రవాహం వచ్చి ప్రవహించి, పొలాన్ని తడిపి, పంటలను పెరిగేటట్లు చేస్తున్నది. వ్యవసాయదారుడు పంటల అభివృద్ధికి అడ్డుగా పెరిగినటువంటి కలుపులను తీసివేస్తున్నాడు. ఆవులు, మేకలు మొదలైన పై వచ్చి పంటను మేయకుండా ఉండేటట్లు రక్షించడం కోసం ఎత్తైన చోట ఒక గుడిసెను వేసుకుని, అందులో ఉండి, పంటల కంటికి రెప్పలా కాపాడుతూ ఉంటాడు. పంటలు కాలక్రమంలో చక్కగా పెరిగి, వరుసలు వరుసలుగా అభివృద్ధి చెంది పెరుగుతాయి. ఈ విధంగా పంటలు పెరిగిన పొలాన్ని చూచి వ్యవసాయదారుడు పొందే ఆనందం చెప్పడానికి సాధ్యం కానిది. తన ప్రయత్నం వ్యర్థం కాకుండా ఫలాన్ని ఇచ్చినందుకు చాలా గొప్ప అతిశయాన్ని అతడు పొందుతాడు.

ఈ విధంగానే, ఇక్కడ భూమియే పంట వేసే చోటు. శ్రీ వేంకటేశ్వరుడు ఆ వ్యవసాయదారుడు. కరుణ అనే నీ ప్రవాహమే జల ప్రవాహం. శ్రీనివాసుని పాదాలలో శరణాగతి చేసినవారే దట్టంగా పెరిగిన పంట. ఎత్తైన తిరుమలయే ఆ వ్యవసాయదారుడు ఎత్తుగా అమర్చుకున్న గుడిసె. దయాదేవీ! శ్రీనివాసుడు ఈ భూమి అంతా ఉజ్జీవనాన్ని పొందాలని కోరుతున్నాడు. చేతనులను తన సంకల్పంతో ఆచార్యుని వద్దకు చేర్చి, వారు వివేకం పొందేటట్లు చేసి, మంచి గతిని పొందేటట్లుగా ఒక ఉపాయాన్ని అన్వేషించేటట్లు చేస్తున్నారడు. ఈ విధంగా శ్రీనివాసుడు వ్యవసాయదారునివలె పెద్ద ప్రయత్నాన్ని చేసిన సమయంలో కరుణ అనే నీ ప్రవాహాలు ప్రవహించి వచ్చి, భూమిని అంతటినీ తడిపి అందులో ప్రవహించి, చేతనులకు దుఃఖం కలుగకుండా మంచి కలిగేటట్లు చేస్తున్నాయి. వీరికి దుర్మార్గుల వల్ల ఏ విధమైన ఆపద కలగకుండా ఉండేటట్లు ఉన్నతమైన తిరుమలలో ఎక్కి ఉండి భగవంతుడు కాపలా కాస్తున్నాడు. ఈ విధంగా మంచి మార్గాన్ని అనుసరించిన ప్రపన్నుల నిండుగా ఉండే భూమి, దట్టంగా పంటతో పెరిగిన పంటతో నిండిన పంట చేను వలె చక్కగా ప్రకాశిస్తున్నది. దీనిని సూచి శ్రీనివాసుడు, బాగా పండిన పంట చేను చూసి ఆనందించే కృషివలుని వలె, చాలా ఆనందిస్తున్నాడు. దీనికి అంతటికి నీవే కదా కారణం.

**22) కలశోదధిసంపదో భవత్యాః కరుణే సన్మతిమంథసంస్కృతాయాః |**

**అమృతాంశమవైమి దివ్యదేహం మృతసంజీవన మంజనాచలేందోః||**

దయాదేవీ! పూర్వం పాలసముద్రం మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకొని చిలుకబడినప్పుడు, ఆ సముద్రం నుండి చంద్రుడు మొదలైనవారు లభించారు. తరువాత, మరణించినవారిని తిరిగి బ్రతికించే అమృతం పుట్టింది. చాలా మధురమైనదిగా, కలతను పొందించటానికి సాధ్యం కానిదిగాను ఉన్నందున నీవు పాల సముద్రం వలే ఉన్నావు. సత్పురుషుల మంచి జ్ఞానం అనే కవ్వంతో పాల సముద్రం వంటి నిన్ను చిలికినప్పుడు నీ నుండి పుట్టిన చాలా సారమైన అమృతమే శ్రీనివాసుని దివ్యమైన తిరుమమేనియై వెలుగుతున్నది. అవధి లేని కరుణను అయిన నీ వల్లనే శుద్ధసత్వమయమైన రూపాన్ని కలిగి, ఈ తిరుమలలో అర్చారూపంగా అతడు అధివసించి ఉన్నాడు. మరణించినవారికి తిరిగి ప్రాణాలను పోసే అమృతం వలె ఈ తిరుమేని కూడా తనను సేవించి శరణు పొందినవారికి యమభయాన్ని పోగొట్టి, మోక్షం వరకు ఉండే అన్ని ప్రయోజనాలను ఇచ్చి ఉజ్జీవింప చేస్తున్నది. ఈ విధంగా భగవంతుడు తిరుమలలో అర్చారూపంతో ఉండడానికి నీవే కారణమై ఉన్నావు.

**23) జలధేరివ శీతతా దయే తత్వం వృషశైలాధిపతేః స్వభావభూతా |**
**ప్రలయారభటీనటీం తదీక్షాం ప్రసభం గ్రాహయసి ప్రసత్తిలాస్యమ్ ॥**

దయాదేవీ! నీటికి చల్లదనం అనే గుణం సహజమైనది. ఒకవేళ దానిని నిప్పులో పెట్టి గాని, ఎండలో పెట్టి గాని వేడిని పొందించినప్పటికీ, మళ్లీ తిరిగి అది చల్లగా అవుతుంది. ఇక, గొప్ప జలాశయమైన సముద్ర స్వభావాన్ని గూర్చి ప్రత్యేకంచి చెప్పాలా? దానివలె, శ్రీ వేంకటేశ్వరునకు

నీవు సహజమైన స్వభావమై ఉన్నావు. కఠినమైన స్వభావం ఆ స్వామిలో మధ్యలో వచ్చి కనిపించినప్పటికీ, మళ్లీ తిరిగి సహజమైన నీవే అతనిలో తల ఎత్తుతావు. ప్రళయకాలలో భగవంతుని సంకల్పమే ఒక నాట్యకత్తె అవుతున్నది. అది, ప్రాణులకు ప్రళయకాలంలో శరీరం ఇంద్రియాలు ఏమీ లేకుండా చేసి, అచేతనంవలె వాటిని ఉంచి, తల విరగబోసుకొన్నదై ఘోరమైన తాండవం చేసే నాట్యకత్తె అవుతున్నది. నీ చల్లని స్వభావం దానిని సహిస్తుందా! నీవు ఆ సంకల్పం అనే నాట్యకత్తెను గట్టిగా పట్టుకొని, ఆ కఠినమైన, క్రూరమైన నాట్యం నుండి ఆమెను నివర్తింప చేస్తున్నావు. ప్రాణులకు శరీరాలను ఇంద్రియాలను ఇచ్చి, సృష్టించడం అనే శాంతమైన, అనుగ్రహాత్మకమైన నటనను పరిగ్రహించేటట్లు చేస్తున్నావు.

భగవంతుడు ప్రళయ కాలంలో తన సంకల్పంతో ప్రాణులను పొందిన స్థితిని చూచి, కరుణను పొందినవాడై, మళ్ళీ సృష్టి కార్యంలో ఆసక్తిని కలిగివాడు అవుతున్నాడు. దీనికి కారణం అతనికి కల దయా గుణమే అనేది ఇక్కడ తాత్పర్యం.

**24) ప్రణతప్రతికూలమూలఘాతీ ప్రతిఘః కోఽపి వృషాచలేశ్వరస్య |**
**కలమే యవసాపచాయనీత్యా కరుణే కింకరతాం తవోపయాతి ॥**

దయాదేవీ! శ్రీ వేంకటేశ్వరునకు అప్పుడప్పుడు కోపం వస్తుంది. అది తనను భజించే భక్తులకు శత్రువులై ఉండేవారి విషయంలోనే ఏర్పడుతుంది. ఆ కోపం, భాగవతుల విషయంలో పగను పొందిన వారిని

నిర్మూలింప చేస్తుంది. కరుణ అనే నిన్ను పరిగ్రహించే దా, అతడు భక్తులను రక్షించాలి. వారికి శత్రువుల వల్ల ఆపద కలుగవచ్చునా? శత్రువులను నశింప చేస్తే కదా భక్తులను రక్షించడం వీలవుతుంది. అందుచేత, నీవు నీ కార్యాన్ని చేయడానికి భగవంతుని విలక్షణమైన కోపం అనుకూలమై ఉండి, నీకు దాస్యం చేస్తున్నది. లోకంలో కూడా పంటల అభివృద్ధికి అడ్డుగా ఉండే కలుపును తీసివేయడం అనేది పంటలను కాపాడడం కోసమే ఉపయోగపడుతున్నది కదా. ఆ విధంగానే భక్తులను మంచికోసమే, వారి శత్రువులను నశింపజేయడం కూడా. ఈ విధంగా శ్రీనివాసుని కోపమనే గుణం కూడా నీకు వశమై ఉన్నది.

**25) అబహిష్కృతనిగ్రహాన్ విదంతః కమలాకాంతగుణాన్ స్వతంత్రతాదీన్ |**
**అవికల్పమనుగ్రహం దుహానాం భవతీమేవ దయే భజంతి సంతః ॥**

దయాదేవీ! శ్రీనివాసునకు స్వాతంత్ర్యం, వీర్యం, శక్తి మొదలైన లెక్కలేనన్ని గుణాలు ఉన్నాయి. అవి అన్నీ జీవులను అతడు కాపాడడం కోసం, దండించడం కోసం ఉపయోగపడగలిగినవి. కరుణ అనే నీవైతే, అనుకూల్యాన్నే చేతనుల విషయంలో కలిగి ఉంటావు. వారిని దండించడానికి కొంచెం కూడా నీవు భగవంతునకు అవకాశాన్ని ఇవ్వవు. మిగిలిన గుణాలకు నీకు మధ్య ఉండే ఈ భేదాన్ని తెలిసిన మహనీయులు నిన్నే శరణంగా ఆశ్రయిస్తున్నారు.

**26) కమలానిలయ స్త్వయా దయాళుః కరుణే నిష్కరుణా నిరూపణే త్వమ్ |**
**అత ఏవ హి తావకాశ్రితానాం దురితానాం భవతి త్వదేవ భీతిః ॥**

శ్రీనివాసుని దయాదేవీ! నీవు శ్రీనివాసుని విడచి ఏనాడు ఉండనందువల్ల, అతడు దయాళువు అనే పేరును పొందాడు. ఇటువంటి నీకు సంబంధించిన ఇతరులను కూడా దయ కలిగినవారుగా చేయగలిగినదానవు నీవు. అయితే, పరిశీలించి చూస్తే, నీ దగ్గర కరుణయే లేదు– అని తెలుస్తుంది. లోకంలో కరుణను కలిగి ఉండే మానవుని దగ్గర జనులు భయపడరు. నిన్ను శరణు పొందినవారి దగ్గర ఉండే పాపాలు వేరు దేనికీ భయపడనప్పటికీ, అవి నిన్ను చూచి చాలా భయపడి పరిగెత్తుకొని పోతున్నాయి. ఈ విధంగా వాటిని భయపడి పరిగెత్తేటట్లు చేస్తునందున, నిన్ను కరుణ లేని దానివని కదా చెప్పాలి.

ఇతరులను కూడా దయ కలిగినవారినిగా చేసే దయాదేవికి దయ లేదు– అనేది ఒక సరసమైన సూక్తి. కరుణను కలిగినవారికే కరుణ ఉంటుంది తప్ప, కరుణకు కరుణ ఉండదు– అని నిరూపించడం కూడా చాలా అందమైన, సరసమైన ప్రక్రియ.

శ్రీవేంకటేశ్వరుని కరుణను ఆశ్రయించినవారి పాపాలు అన్ని వశించిపోతాయి– అని కరుణను పొగడన రీతి ఇది.

**27) అతిలంఘితశాసనేష్వభీక్ష్ణం వృషశైలాధిపతి ర్విజృంభితోష్మా!**
**పునరేవ దయే క్షమానిదానైః భవతీ మాద్రియతే భవత్యధీనైః ॥**

దయాదేవీ! వేదాలు, స్మృతులు అన్నీ కూడా శ్రీనివాసుని ఆజ్ఞా రూపాలే. వాటిలో చెప్పిన విధంగా జీవులు నడచుకోవాలి. వాటికి విరుద్ధంగా ప్రవర్తిస్తే అతని ఆజ్ఞను మీరినట్లు అవుతుంది. సంసార మండలంలో ఉండే జీవులు అవివేకం వల్ల మాటిమాటికి శాస్త్రాలను అన్నిటిని అతిక్రమించి నడుచుకుంటున్నారు. ఆ పాపాలు వారి విషయంలో శ్రీనివాసునకు కలిగే కోపం ఇంకా ఇంకా వృద్ధి చెందేటట్లు చేస్తూ, అతనికి చాలా మిక్కిలి కోపాన్ని కలిగిస్తాయి. అందువల్ల పాపం చేసిన చేతనులను భగవంతుడు దండించడానికి సిద్ధపడతాడు. దానిని నీవు సహిస్తావా? ఆ జీవులను వారి వారి శక్తికి తగినట్లు ప్రాయశ్చిత్తాలను చేసేటట్లుగా నీవే వారిని ప్రోత్సహిస్తున్నావు. వారు ఆచరించే ప్రాయశ్చిత్తకర్మలు భగవంతునకు కలిగిన తాపజీవరాన్ని పోగొట్టే మందుగా నిలచి, అతని కోపాన్ని తీరుస్తున్నాయి. శ్రీనివాసుడు కూడా మనసులో చల్లబడి, మళ్లీ తిరిగి నీకు వశపడినవాడై అవుతున్నాడు. ఈ విధంగా పాపులైన చేతనులను మంచి మార్గంలో పెట్టి నీవు ఉజ్జీవింప చేస్తున్నావు.

**28) కరుణే దురితేషు మామకేషు ప్రతికారాంతరదుర్జయేషు ఖిన్నః |**
**కవచాయితయా త్వయైవ శార్ఙ్గీ విజయస్థాన ముపాశ్రితో వృషాద్రిమ్ ॥**

దయాదేవీ! నేను చేసిన పాపాలు అనేకం. శ్రీనివాసుడు నా పాపాలను శత్రువులుగా భావించి, వాటిని ఏ విధంగా అయినా పోగొట్టి, తాను విజయాన్ని పొందాలని ప్రయత్నం చేస్తున్నాడు. వేరు ఏ విధంగా

అయినా అతడు జయించడానికి సాధ్యం కానట్లుగా ఉండే రీతిలో, అంతటి బలాన్ని కలిగినవి, నా పాపాలు. అవి, ఆ స్వామి మనస్సులో బాణంవలె నాటుకొని, అతనిని బాధిస్తున్నాయి అందువల్ల అతడు చాలా వేదనను పొందుతున్నాడు. దానికి రక్షణగా కరుణ అనే నిన్నే కవచంగా అతడు ధరించాడు. చేతిలో శార్ ఙ్గమనే విల్లు ధరించాడు. నా పాపాలను తరిమికొట్టి, జయాన్ని పొందాలని, పొందడానికి తగిన ఒక చోటును అన్వేషించాడు. శ్రీ వేంకటాచలాన్ని తగిన స్థలంగా అతడు భావించాడు. ఆ పర్వతాన్ని చూడగానే, శత్రువులైన నా పాపాలు నశించిపోతాయి అని నిశ్చయించుకున్నాడు. ఆ పర్వతంలోనే తన తిరుమేని అందాన్ని గుణాలను ప్రదర్శిస్తూ, నీతో నిత్యవాసం చేస్తున్నాడు. నీవు కవచమై నిలచి, అతని మనసులో నా పాపాలు చేరకుండా ఉండేటట్లు చేస్తున్నావు.

**29) మయి తిష్ఠతి దుష్కృతాం ప్రధానే మితదోషానితరాన్ విచిన్వతీ త్వమ్ |**

**అపరాధగణై రపూర్ణకుక్షిః కమలాకాంతదయే కథం భవిత్రీ ॥**

శ్రీనివాసుని దయాదేవీ! నీ కడుపు చాలా పెద్దది. దానికి పూర్ణభోజనం ఇవ్వాలి కదా. లేకపోతే నీవు ఉపవాసంతో ఉండవలసి వస్తుంది. నీ కడుపుకు భోజనం చేతనులు చేసిన పాపాలే. నీకు పూర్ణంగా భోజనం ఇచ్చేవారు నావంటివారు ఎవరూ లేరు లే. పాపులలో మొట్టమొదటి స్థానం పొందినవాడను నేనే. నావలే పాపాలు ఉండేవారు ఎవరు నీకు దొరుకరు. నీకు కడుపు నిండుగా భోజనం ఇవ్వగలిగిన నన్ను విడచి, తక్కువ భోజనాన్నే ఇవ్వగలిగిన ఇతరులను ఎందుకు

అన్వేషిస్తున్నావు? వారి దగ్గర ఉండే పాపాలను అన్నిటినీ నీవు భుజించినప్పటికీ నీ కడుపు నిండదు కదా. నీకు చాలిన భోజనం ఇవ్వడానికి నా వద్దనే కదా అన్ని పాపాలు బాగా పేరుకుని ఉన్నాయి. నన్ను కాదని, నీవు ఇతరుల దగ్గరకు వెళితే, ఈ కడుపుకు సరిపోయే భోజనం పొందకుండా ఉపవాసంతో ఉండవలసి వస్తుంది కదా. నీవు అప్పుడు ఏ విధంగా జీవిస్తావు? అని నీ నీ విషయంలో నేను జాలి పడుతున్నాను.

**30) అహమస్మ్యపరాధచక్రవర్తీ కరుణే త్వం చ గుణేషు సార్వభౌమీ |**
**విదుషీ స్థితి మీదృశీం స్వయం మాం వృషశైలేశ్వరపాదసాత్ కురు త్వమ్ ॥**

శ్రీనివాసుని దయాదేవీ! దోషాలకు అన్నిటికి నేను చక్రవర్తినై ఉన్నాను. దోషాలే నా పాలనకు విషయమై ఉండే వస్తువులు. నీవు భగవంతుని గుణాలలో చక్రవర్తినివై ఉన్నావు. మిగిలిన గుణాలు అన్నీ నీ పరిపాలనకు విషయాలై ఉన్నవి కదా. ఈ విధంగా మన ఇద్దరికీ సమానంగా ఉండే ఈ గొప్పతనాలను నీవు బాగా గమనించాలి. రాణివి అయిన నీవు నాపై స్వయంగానే దండెత్తి, దోషాలు అనే నా రాజ్యాన్ని నీవు ఆక్రమించుకొని, నన్ను పట్టుకుని శ్రీ వేంకటేశ్వరుని పాదాల కింద చెరలో పెట్టి ఉంచాలి.

గుణాలలో ప్రాధాన్యాన్ని పొందిన నీవు పాపులకు ప్రధానుడను అయిన నా పాపాలను పోగొట్టి నన్ను శ్రీ వేంకటనాథుని రెండు పాదాల కింద చేర్చాలి అని ప్రార్థించిన రీతి ఇది.

పాపచక్రంలో పాపాల సుడిలో చిక్కుకుని ఉండే నేను అపరాధ చక్రవర్తిని. నీవు గుణాలకు చక్రవర్తినివి. సమమైన పదవిలో ఉండేవారు ఒకరికి ఒకరు సహాయం చేసుకోవడం న్యాయమే కదా. అందుచేత కరుణ అయిన నీవు, నీకు నివాస స్థానం అయిన శ్రీనివాసుని శ్రీచరణాలలో నన్ను చేర్చడం అనే ఈ సహాయాన్ని నాకు చేయాలి– అని కూడా ఇక్కడ తాత్పర్యాన్ని చెప్పవచ్చు.

**31) అశిథిలకరణే ఽస్మిన్నక్షతశ్వాసవృత్తౌ**
**వపుషి గమనయోగ్యే వాస మాసాదయేయమ్ |**
**వృషగిరికటకేషు వ్యంజయత్సు ప్రతీతైః**
**మధుమథనదయే త్వాం వారిధారావిశేషైః ॥**

శ్రీ వేంకటనాథుని కరుణా! ఈ జన్మలో ఈ శరీరం చక్కగా ఉండేటప్పుడే శ్రీ వేంకటాద్రికి వెళ్లాలి. వయస్సు ముదిరిగా, ముదరగా, చేతులు, కాళ్లు, కళ్ళు మొదలైన ఇంద్రియాలు తడబడతాయి. ప్రాణవాయువు తన కార్యాన్ని తగిన రీతిలో చేయలేకుండా పోతుంది. ఆ స్థితిలో తిరుమలలో చేరడం సాధ్యం కాదు. అందుచేత శరీరం నడవగలిగిన స్థితిని కల వయస్సులోనే, ఇంద్రియాలు, ప్రాణవాయువు తగిన దశలో ఉండేటప్పుడే, తిరుమలకు నేను చేరాలి. ఆ కొండ చరియలలో ఎప్పుడూ నివాసం ఉండే శ్రీనివాసుని సేవించి ఆనందించేటట్లు నన్ను నీవు చేయాలి. తిరుమలలో చాలా కీర్తిని పొందిన, పవిత్రమైన కొండవాగులలో ప్రవహిస్తూనే ఉంటాయి. వాటిని చూసేటప్పుడు కరుణ అయిన నీ

ప్రవాహాలే ఆ విధంగా ప్రవహిస్తున్నవా! అని తోస్తుంది. అప్పుడు వాటిని కూడా దర్శించి, ఆనందించవచ్చు.

**32) అవిదితనిజయోగక్షేమ మాత్మానభిజ్ఞం**
**గుణలవరహితం మాం గోప్తుకామా దయే త్వమ్ |**
**పరవతి చతురై స్తై విభ్రమైః శ్రీనివాసే**
**బహుమతి మనపాయాం విందసి శ్రీధరణ్యోః ॥**

శ్రీనివాసుని దయాదేవీ! నేను చాలా నీచుడను. కొత్తగా ఒక యోగ్యతను పొందడం కానీ, పొందదగిన యోగ్యతను కోసం వేచి ఉండడం గానీ నాకు తెలియదు ఇంతేనా! ఆత్మను గూర్చి కూడా నాకు ఏమీ తెలియదు. "ఆత్మ శరీరం కంటే భిన్నమైనవాడు, నాశం లేనివాడు, భగవంతునకు శేషభూతుడు" —అనే క్రమంలో ఉండే జ్ఞానం కూడా కొంచెం కూడా పొందనివాడను, నేను. నా దగ్గర కొంచమైనా మంచి గుణం ఉన్నదా? అది కూడా లేదు. ఈ విధంగా చాలా నీచమైన స్థితిలో ఉండే నన్ను రక్షించాలని నీవు అనుకున్నావు. నీ నాయకుడైన శ్రీనివాసుని దగ్గర నీ చాతుర్యంతో అనేక విధాలైన, అతనిని వ్యామోహపరచే కార్యాలను చేస్తున్నావు. నీవు చెప్పినదానిని చెప్పినట్లుగా చేయాలని అతడు చూస్తున్నాడు. ఈ స్థితిలో అతనికి దగ్గర ఉండే లక్ష్మీదేవి, భూదేవి కూడా నీ సామర్థ్యాన్ని చూచి, అరుదైన కార్యాలను చేసే నిన్ను చూచిచాలా ఆనందించి, ఎల్లప్పుడూ నిన్ను పొగడుతున్నారు. వారికి, నన్ను కాపాడడంలో మిక్కిలి ఆసక్తి ఉన్నది. వారు నా స్థితిని గమనించి,

నన్ను రక్షించాలని స్వామి దగ్గర చెప్పినప్పటికీ, ఆ శ్రీనివాసుడు ఆ మాటలను విననట్లు తెలియలేదు. వారు విజయాన్ని పొందలేని ఒక విషయంలో నీవు విజయాన్ని పొందడవల్ల వారు నీ విషయంలో అసూయను ఏమీ పొందడం లేదు. తమకు సాధ్యం కానిచ తమ మనోరథం నీ ద్వారా నెరవేరుతున్నది కనుక, శాశ్వతమైన గొప్ప గౌరవాన్ని నీ విషయంలో వారు కలిగి ఉన్నారు.

**33) ఫలవితరణదక్షం పక్షపాతానభిజ్ఞం**
**ప్రగుణ మనువిధేయం ప్రాప్య పద్మాసహాయమ్|**
**మహతి గుణసమాజే మానపూర్వం దయే త్వం**
**ప్రతివదసి యథార్హం పాప్మనాం మామకానామ్ ॥**

దయాదేవీ! నేను లెక్కలేనన్ని పాపాలను చేశాను. దోషాలను కలిగినవాడను అయిన నాపై ఆరోపింపబడిన అపరాధం ఒక న్యాయస్థానంలో విచారింపబడుతున్నది.
లోకంలో న్యాయస్థానానికి ఆధిపత్యాన్ని కలిగి నీతిని ఇచ్చే న్యాయాధిపతి సాధారణంగా ఒకడే ఉండవచ్చు. కొన్ని సమయాలలో ఇద్దరు న్యాయాధికారులు కూడా అపరాధాన్ని విచారించవచ్చు. న్యాయాధికారి పద్ధతి ప్రకారం పూర్తిగా విచారించి తీర్పును ఇవ్వడానిలో సమర్థులై ఉంటారు. ఏకపక్షంగా కాకుండా మధ్యస్థంగా నిలచి విచారిస్తారు. ఋజుత్వాన్ని కలిగినవారై ఉంటారు. వాది ప్రతివాదులు ఇద్దరూ తమ తమ సాక్షులను భయం లేకుండా ప్రస్తావించి తెలుపడం కోసం, తమ

దగ్గరకు ఆ దోషులు వచ్చి చెప్పుకునే రీతిలో సులభులై ఉంటారు. క్రిమినల్ కేసులో దోషాన్ని ఆరోపించినవాడు, కానీ అతనికోసం వచ్చి వాదించేవాడు కానీ, దోషిలోని దోషాలను ప్రస్తావించి వివరించి, తగిన చట్టాలను ప్రస్తావించి, దోషిని దండించమని అడుగుతారు దోషికోసం అతనిపక్షంలో మాట్లాడే వకీలు మొదలైనవారు ఎదురు సాక్ష్యాలను చూపించి, ఎదురుపక్షం వారు వాదించిన వాదాలను ఎదిరిస్తూ, వారు ఆరోపించిన దోషాలకు అన్నిటికీ సమాధానాన్ని చెప్పి, దోషం ఆరోపింపబడినవాడు దోషి కాడని, అతనిని దండించే అవకాశం లేదని ఎదురువాదాన్ని చేసి, వాటికి తగిన ఆధారాలను చూపిస్తారు. న్యాయాధికారులు ఈ విధంగా ఉండే ఇరుపక్షాల వాదాలను విని, న్యాయానికి తగిన రీతిలో తీర్పును చెబుతారు.

దయాదేవీ! నా దోషాన్ని విచారించడం కోసం ఏర్పడిన న్యాయస్థానంలో శ్రీవేంకటేశ్వరుడే న్యాయాధిపతిగా ఉన్నాడు. లక్ష్మీదేవి అతనికి సహాయం చేసే వేరొక న్యాయాధికారిణిగా ఉన్నది. భగవంతుడు చేతనుల కర్మలకు తగిన ఫలాన్ని ఇస్తాడు. ఏకపక్షంగా కాకుండా అందరినీ సమానంగా భావిస్తాడు. చాలా ఋజుత్వంతో నడుచుకుంటాడు. క్రమాన్ని తప్పనివాడు ఎవడైనా సరే, అతన్ని సులభంగా సమీపించవచ్చు. (శ్లేషాలంకార ప్రక్రియలో– గొప్ప తిరుమంత్రాన్ని అనుసంధించేవారికి శ్రీనివాసుడు వశమై ఉంటాడు అని ఇక్కడ తాత్పర్యం) ఇటువంటి శ్రీనివాసుడు, లక్ష్మీదేవి అనే దివ్యదంపతులను న్యాయాధికారులుగా కలిగిన న్యాయస్థానంలో నేను దోషాలు ఆరోపింపబడి

దోషిగా నిలబడ్డాను. నా పాపాలు నాపై దోషాలను ఆరోపించి, నన్ను దండించమని వాదాన్ని చేస్తున్నాయి. భగవంతుని మిగిలిన గుణాలు అయిన జ్ఞానం, శక్తి, వీర్యం, తేజస్సు మొదలైనవి సమూహంగా చేరి ఉండి, కేసులో వాదాలను జాగ్రత్తగా విని, తమ అభిప్రాయాన్ని తెలిపి, న్యాయాధికారి తీర్పును ఇవ్వడానికి సహాయం చేసే జూరీలుగా ఉన్నారు.

దయాదేవీ! నీవు నా విషయంలో చల్లని మనసును కలిగి ఉన్నావు. నాకోసం వాదించే కార్యాన్ని నిర్వహిస్తున్నావు. మగవారి కేసులో స్త్రీలు వచ్చి వాదించడంలో ఉండే సంకోచాన్ని నాకోసం విడచిపెట్టి, న్యాయస్థానానికి వచ్చావు. అందుచేత, నీ గౌరవాన్ని కోల్పోకుండా చాతుర్యంతో నడచుకుంటున్నావు. నా విషయంలో నీకు ఉండే ఆదరమే దానికి కారణం. వాదులైన పాపాలు ప్రస్తావించి పలికే వాదాలను అన్నిటిని తగిన శాస్త్రాలను ఉదాహరించి పలికి ఖండిస్తున్నావు. నా పాపాలు అన్నీ నేను చేసిన ప్రపత్తిచేతనే మన్నింపబడిపోయాయి అని ప్రపత్తిశాస్త్రాన్ని ఆధారంగా చూపించి, ఎదురువాదాన్ని చేసి, నాపై దోషాన్ని ఆరోపించి పలికేవారి నోరు మూయించి, వారి మాటను కాదనేటట్లు చేసి, కేసులో విజయాన్ని సాధిస్తున్నావు. ఈ విధంగా నీవు నన్ను రక్షిస్తున్నావు.

**34) అనుభవితు మమౌఘం నాల మాగామికాలః**
**ప్రశమయితు మశేషం నిష్క్రియాభి ర్న శక్యమ్ ।**
**స్వయమితి హి దయే త్వం స్వీకృతశ్రీనివాసా**
**శిథిలితభవభీతిః శ్రేయసే జాయసే నః ॥**

శ్రీ వేంకటేశ్వరుని దయాదేవీ! పాపాలను ఒకడు చేసినట్లయితే, వాటి ఫలాన్ని అతడు అనుభవిస్తేనే అవి నశిస్తాయి, లేకపోతే, శాస్త్రాలలో చెప్పబడిన ప్రాయశ్చిత్తకర్మలను చేసి పాపాలను పోగొట్టుకోవచ్చు. మనం చేసిన అంతు లేని పాపాలకు కల మనం వాటిని అనుభవించే వాటిని పోగొట్టుకోవాలి. ఆ విధంగా పోగొట్టుకోకపోతే అవి ఏ విధంగా తీరుతాయి? ఒక పాపానికే ఫలాన్ని చిరకాలం అనుభవించాలి కదా. అది ముగిసేలోగానే ఇంకొక పాపం ఫలం ఫలాన్ని ఇవ్వడానికి ఆరంభిస్తుంది కదా. అటువంటి స్థితిలో, ఇది చాలదు అన్నట్లు, మరికొన్ని నూతనమైన పాపాలు వచ్చి చేరుతాయి. అంతులేని పాపాల ఫలం రాబోయే కాలం అంతా మనం అనుభవించినా, పాపాలు తీరిపోవు కదా. ప్రాయశ్చిత్త కర్మలనుచేసి, ఆ పాపాలను పోగొట్టుకోవాలని ప్రయత్నం చేస్తే, వాటిలో కూడా పలు ఆటంకాలు. దేహశ్రమం, డబ్బు ఖర్చు మొదలైనవి ఏర్పడతాయి. ఒక ప్రాయశ్చిత్తం చేయడంలోనే కొన్ని పాపాలను చేయడం సంభవించడం చేత, పాపాలు ఇంకా ఇంకా పెరుగుతూనే ఉంటాయి. అందుచేత మన పాపాలు ఏ దారులలోను ఎప్పటికీ తీరిపోవు. దయాదేవీ! ఈ విషయాన్ని నీవు తెలిసికుంటున్నావు. వీటిని అన్నిటిని చాలా అందంగా శ్రీనివాసుని సన్నిధిలో విన్నపిస్తున్నావు. మా పాపాలు అన్నిటికీ ఫలం ఇవ్వడం అనేది అతనికి సాధ్యం కాని కార్యం అనే విషయాన్ని పలు యుక్తులతో అతనికి తెలియజేస్తున్నావు. నీ తీయని మాటలతో అతనిని మోహింపజేసి నీ వశం చేసుకుంటున్నావు. ఇందువల్ల మాకు సంసారభయం తగ్గిపోతున్నది. నీ మాటను కాదనలేని

శ్రీనివాసుడు మేము చేసే చాలా అల్పమైన ఉపాయం అయిన ప్రపత్తి చేతనే మా దోషాలను క్షమిస్తాడు అనే నమ్మిక మాకు కలుగుతున్నది. నీవు స్వయంగానే ప్రయత్నం చేసి మమ్ములను ప్రపత్తిలో ప్రవేశింప చేసి, మోక్షాన్ని మేము పొందే దారిని కలిగిస్తున్నావు. ఈ విధంగా నీవు మంచి కోసమే నీవు ఆవిర్భవించావు. నీ గొప్పతనాన్ని గూర్చి ఏమని చెప్పగలం?

**35) అవతరణవిశేషై రాత్మలీలాపదేశైః**
**అవమతి మనుకంపే మందచిత్తేషు విందన్ ।**
**వృషభశిఖరినాథ స్త్వన్నిదేశేన నూనం**
**భజతి శరణభాజాం భావినో జన్మభేదాన్ ॥**

దయాదేవీ! శ్రీ వేంకటేశ్వరుడు మత్స్యంగా, కూర్మంగా, వరాహంగా, మానవునిగా ఈ విధంగా పలు విధాలైన అవతారాలను ఎత్తాడు. ఈ అవతారాలలో ఇతని గొప్పతనాన్ని తెలియకుండా మతిభ్రష్టులైన హిరణ్యుడు రావణుడు, శిశుపాలుడు మొదలైన పలువురు ఈ స్వామినిగూర్చి చాలా తక్కువగా భావించి, అనేక విధాలుగా అవమానించారు. అజ్ఞానుల వల్ల ఏర్పడే దుఃఖాలకు, అవమానానికి లక్ష్యం అయినప్పటికీ ఎందుకు ఇతడు ఈ విధంగా అవతరించాలి? వీటిని అన్నిటిని భగవంతుడు లీలగా పరిగ్రహించాడు– అని పురాణ వృత్తాంతాలు విన్నవారు చెబుతున్నారు. లీల అనేది పేరుకు మాత్రమే. నాకు ఏమని తోస్తున్నది?అని అంటే, నీవే శ్రీ వేంకటేశ్వరుని ఈ

విధంగా అనేక విధాలైన అవతారాలను ఎత్తేటట్లు ఆజ్ఞాపిస్తున్నావు. ఎందుకోసం? జీవులు ఇతనిని శరణు పొంది, తమ పాపాలను తీర్చుకొని మోక్షం పొందడానికి వీలుగా ఉండాలి. వారు అనేక విధాలైన జన్మలలో పుట్టి, పలు దుఃఖాలలో చిక్కుకొని తపించి కదా, తాము చేసిన పాపాలను తీర్చుకోవాలి. వారికి అటువంటి దుఃఖాలను కలిగించడంలో నీకు ఇష్టం లేదు. వారు శ్రమ లేకుండా పాపాలను తీర్చుకోవడానికి నీవు ఒక యుక్తిని చేశావు. వారు ఎత్తవలసిన జన్మలను అన్నిటీని శ్రీనివాసుడే ఎత్తేటట్లు ఇతనిని ఆజ్ఞాపించావు. నీ ఆజ్ఞను దాటగలిగినవాడా అతడు! అందుచేత వారు అనేక విధాలయాలైన జన్మలను ఎత్తవలసిన అవసరం లేకుండా పోయింది. భగవంతుని అనేకవిధాలైన అవతారాలను వారు చక్కగా అనుభవించి, ఆ స్వామి మహిమను వారు తెలుసుకుని, ఆ స్వామి శ్రీచరణాలను శరణు పొంది, తరిస్తున్నారు. ఇదే వాస్తవమైన దశ.

**36) పరహితమనుకంపే భావయంత్యాం భవత్యాం**
**స్థిరమనుపధి హార్దం శ్రీనివాసో దధానః |**
**లలితరుచిషు లక్ష్మీభూమినీళాసు నూనం**
**ప్రథయతి బహుమానం త్వత్ప్రతిచ్ఛందబుద్ధ్యా ॥**

దయాదేవీ! నీవు ఒక్కతెవే ఇతరులకు మంచిని కలిగించడంలో ఆలోచిస్తూ ఉంటావు. ఈ స్వభావం ఇక ఎవరికీ లేదు, నీ పట్ల శ్రీనివాసుడు స్థిరమైన, మనః పూర్వకమైన ప్రేమను కలిగి ఉన్నాడు. లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి అనే దివ్యపత్నులు కన్నులను ఆనందింప చేసే

అందాన్ని కలవారు. వారి విషయంలో కూడా శ్రీనివాసుడు మిక్కిలి గౌరవ బుద్ధి కలిగి ఉన్నాడు. దీనికి కారణం ఏమో తెలుసునా? వారు కూడా నీ నీడలే అని చెప్పేటట్లుగా నీ స్వభావాన్ని ఒక అవధిలో కలిగి ఉన్నారు. నీ ప్రతిబింబాలు. వారు– అనే భావంతోనే వారి విషయంలో భగవంతుడు గౌరవాన్ని కలిగి ఉన్నాడు. ఇక, ఇప్పుడు, నీ విషయంలో అతనికి ఎటువంటి గౌరవం ఉంటుంది? అనేది చెప్పాలా!

**37) వృషగిరిసవిధేషు వ్యాజతో వాసభాజాం**
**దురితకలుషితానాం దూయమానా దయే త్వమ్ |**
**కరణవిలయకాలే కాందిశీకస్మృతీనాం**
**స్మరయసి బహులీలం మాధవం సావధానా ॥**

దయాదేవీ! వేంకటాచలంలోనే నివసించాలి అనే నిర్బంధం లేదు. ఆ పర్వతానికి దగ్గరలో ఉండే చోట్లలో నివసించినా చాలు. "ఇది పుణ్యక్షేత్రం, ఇక్కడ నివసిస్తే మంచిని పొందవచ్చు" అనే భావంతో నివసించాలి అనే నిర్బంధం కూడా లేదు. జీవనోపాధిని సంపాదించుకోవడం మొదలైన వాటిలో ఏదో ఒక కారణాన్ని పురస్కరించుకొని నివసించినా చాలు. ఈ విధంగా పర్వతం దగ్గర నివసించేవారు ఎటువంటి పాపాలను చేసినా వారు పాపాలను చేయడంలో ఏమి బాధపడకుండా ఉండగా, నీవు మాత్రం వారి కోసం బాధపడుతున్నావు. వారికి పాపాల ఫలం వస్తుంది అని నీవు బాధపడి, వారికి ఏ విధంగా అయినా సహాయం చేయాలని భావిస్తున్నావు.

ఎటువంటిది ఆ సహాయం? ఆ పాపులను ప్రపత్తిలో ప్రేరేపించి, దానిని చేసేటట్లు చేసి, వారి మరణ కాలంలో ఇంద్రియాలు అన్ని శిథిలమై, స్మరణలు అన్నీ వారు కోల్పోయినప్పుడు, ఈ పర్వతంలో పలు లీలలను చేస్తూ దివ్య పత్నితో కలసి వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వరుడు వారిని స్మరించేటట్టు మిక్కిలి ఉద్దేశంతో నీవు చేస్తున్నవు. తరువాత, ఆ పాపులు కూడా మరణించే కాలంలో భగవంతుని స్మరించి సద్గతిని పొందేటట్లు చేస్తున్నావు. దీనికి అంతటికి కారణం వారు పర్వత సమీపంలో నివసించడమే.

**38) దిశి దిశి గతివిద్భి ర్దేశికై ర్నీయమానా**
**స్థిరతరమనుకంపే స్త్యానలగ్నా గుణై స్త్వమ్ |**
**పరిగతవృషశైలం పారమారోపయంతీ**
**భవజలధిగతానాం పోతపాత్రీ భవిత్రీ ॥**

లోకంలో సముద్రంలో మునిగిపోయేవారిని పెద్ద పడవలలో ఎక్కించి తీరాన్ని చేర్చడం క్రమం. పడవను నడిపేవారు తీరానికి చేరే దారులను చక్కగా తెలిసినవారై ఉంటారు. పడవలు సంకెళ్లు, దారాలు అనే వీటితో చాలా గట్టిగా కట్టబడి ఉంటాయి. పడవలను నడిపేవారు ఇటువంటి పడవలలో జనులను ఎక్కించి, వారు చేరవలసిన దిక్కులలో పడవను నడిపి, వారిని వారి గమ్యాలకు చేరుస్తారు. దయాదేవీ! నిన్ను ఒక పడవ అని చెప్పవచ్చు. శ్రీనివాసుని జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు ఆ పడవకు కట్టబడిన సంకెళ్లు, దారాలుగా నిన్ను చుట్టుకుని ఉన్నాయి.

ఆచార్యులు ఈ పడవలను నడిపేవారు. వారు చేతనులకు చూపవలసిన మంచి దారులను తెలిసినవారు ఆచార్యులు జీవులను నీ సహాయంతో శ్రీవేంకటేశ్వరుని దగ్గరకు తీసుకొని పోతున్నారు. అతడే చేరవలసిన తీరమై ఉన్నాడు, అందుచేత నీవు సంసార సముద్రంలో మునిగినవారిని తీరాన్ని చేర్చే పడవగా వెలుగుతున్నావు.

చేతనులు సంసారంలో కష్టాలను పడుతున్నారు. ఆచార్యులు చేతనులు మోక్షం పొందడానికి తగిన ప్రపత్తిని చక్కగా తెలిసినవారు. చేతనులను మంచి ఉపదేశాలతో సంస్కరించి, వారిని ప్రపత్తిని చేసేటట్లుగా ప్రేరేపించి, వారిచే ఉపాయాన్ని చేయించి. వారి విషయంలో భగవంతునకు కరుణ కడిగేటట్లు చేస్తున్నారు. భగవంతుని జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు కరుణకు వశమై, సహాయం చేసి కరుణకు బలాన్ని కలిగిస్తున్నవి. ఇందువల్ల కరుణవల్ల జీవులు చేతనులు శ్రీవేంకటేశ్వరుని చరణాలను చేరి. అతని కటాక్షంతో మోక్షానందాన్ని పొందుతున్నారు.

**39) పరిమితఫలసంగాత్ ప్రాణినః కింపచానాః**
**నిగమవిపణిమధ్యే నిత్యముక్తానుషక్తమ్ |**
**ప్రసదనమనుకంపే ప్రాప్తవత్యా భవత్యా**
**వృషగిరిహరినీలం వ్యంజితం నిర్విశంతి ॥**

లోకంలో పెద్ద విపణి వీథిలో తక్కువ విలువ కలిగిన వస్తువులు, ఎక్కువ విలువ కలిగిన వస్తువులు అనే వీటిలో దేనిని అయినా వెలయిచ్చి కొనవచ్చును. జనులు తమ తమ రుచికి, జ్ఞానానికి

తగినట్లుగా ఉన్నతమైన వస్తువును కానీ, తక్కువ విలువ కలిగిన వస్తువును కానీ కొంటారు. కొందరు ఉన్నతమైన వస్తువులు ఉండే చోటు తెలియకుండా ఉన్నందువల్ల, జ్ఞానలోపం చేత నీచవస్తువులనే కొనడానికి సిద్ధపడతారు. అంగడి వీధినిగూర్చి వివరంగా తెలిసిన ఇంకొకరు వచ్చి, ఈ అల్ప జ్ఞానాన్ని కరువారి విషయంలో కరుణతో తక్కువ వస్తువులను కొనకుండా ఉండేటట్లు చేసి, ఉన్నతమైన ముత్యాలు, రత్నాలు ఉండే చోటుకు తీసుకుని పోయి, వాటిని వారు కొనేటట్లు చేసి, వారికి మంచిని కలిగించడం అనేది ఉన్నది. ఈ ఉదాహరణాన్ని పురస్కరించుకొని ఈ శ్లోకంలో చెప్పబడుతున్నది.

శ్రీనివాసుని దయాదేవీ! వేదం అనేది ఒక పెద్ద అంగడి వీధి. సకలవిషయాలు వేదంలో చెప్పబడ్డాయి. కొందరు తమ రుచికి, తమ జ్ఞానానికి తగినట్లు వేదాల నుండి విషయాలను తెలుసుకొని తమకు కావలసినవానిని పొందాలని కోరుతారు. అల్ప జ్ఞానాన్ని కలవారు వేదంలో చెప్పబడిన అల్ప ఫలాలనే ఇచ్చే భాగాలను మాత్రం గ్రహించి తెలుసుకొని, వాటిని పొందడానికి తగిన ఉపాయాలను చేయడానికి సిద్ధపడతారు. అటువంటివారి విషయంలో నీకు చాలా ప్రేమ ఉన్నది. "వేదంలో మోక్షాన్ని చూపించే భాగాలు ఉన్నవి కదా. వాటిలో వీరికి మనసు పోలేదే! అల్ప ఫలాలలోనే కోరి అన్వేషించి, వీరు తమను పాడు చేసుకుంటున్నారే! " అని వారి విషయంలో నీవు జాలిని, దయను పొందుతున్నావు. వారి మనస్సును నీవు మోక్షమార్గం వైపు మళ్లిస్తున్నావు. వారు, తరువాత, వేదాంతాలలో అభిరుచిని కలిగినవారై,

ఈ లోక ప్రయోజనాలలో ఉండే తక్కువదనాన్ని తెలుసుకోగలుగుతున్నారు. శాశ్వతమైన మోక్షానందాన్ని పొందాలని కోరుతున్నారు. ఆ వేదాంతాలలో నిత్యసూరులచేత, ముక్తులచేత పరోపేష్టింపబడిన పరమాత్మగా చెప్పబడినవాడు శ్రీవేంకటేశ్వరుడే అని వారికి నీవు తెలియజేస్తున్నావు. అందువల్ల తిరుమలలో ఇంద్రనీలరత్నంవలె ప్రకాశించే శ్రీవేంకటేశ్వరుని తిరుమేని అందంలో అభినివేశాన్ని పొంది, అతనిని వారు ఆశించి అనుభవిస్తున్నారు. కరుణ అనే నీవు సహాయం చేసినందువల్ల కదా, వారికి ఈ భాగ్యం లభించింది!

**40) త్వయి బహుమతిహీనః శ్రీనివాసానుకంపే**
**జగతి గతి మిహాన్యాం దేవి సమ్మన్యతే యః |**
**స ఖలు విబుధసింధౌ సన్నికర్షే వహంత్యాం**
**శమయతి మృగతృష్ణావీచికాభిః పిపాసామ్ ॥**

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! నీ కంటే ఉన్నతమైన వస్తువు వేరొకటి ఏది లేదు అనేటట్లుగా ఉండే గొప్పతనాన్ని కలిగినదానవు, నీవు. నీవు పాపులకు సహాయం చేస్తున్నావు. నిన్ను పొందడంలో కొంచెం కూడా కష్టం లేదు. ఇటువంటి నీ విషయంలో గొప్ప గౌరవాన్ని పొంది, నిన్నే శరణంగా ఆశ్రయించడమే ఈ లోకంలో ఉండే చేతనుల క్షేమానికి దారి. ఈ విధంగా ఉండగా, ఎవడైనా ఒకడు నిన్ను కాకుండా, ఇక ఎవరిని అయినా గతి అనే భావించి, తనకు శరణంగా, ఆలంబనంగా గ్రహిస్తే, అతని కంటే మూఢుడు ఇంకొకడు లేడు. ఉదాహరణంగా– దేవనది అయిన గంగ

దగ్గరగా ప్రవహిస్తూ ఉన్నది. అక్కడ ఉండే ఒక మూఢుఢు దాహంతో బాధపడుతున్నాడు. తన దాహాన్ని తీర్చుకోవడానికి ఈ గంగనీరు తగినది కాదు అని భావిస్తున్నాడు. తనకు చాలా దూరంలో ఒక కాలువ ఉన్నట్లు కనబడుతున్నది. ఎండ వేడిమి చాలా అధికంగా ఉంటే, నీటికెరటాలు లేస్తున్నట్లుగా తోస్తుందికదా. ఆ దృశ్యాన్ని చూచి, తన దాహాన్ని తీసుకోవాలని వెళుతున్నాడు, ఈ మూఢుడు. దీనివల్ల ఏదైనా ప్రయోజనం ఉంటుందా? ఆ విధంగానే, దయాదేవి అయిన నిన్ను కాదని, వేరు గతి ఉన్నదని భావించేవాడుకూడా చాలా మూఢుడు కనుక, వాడు మంచి గతిని పొందలేడు.

**41) ఆజ్ఞాం ఖ్యాతిం ధన మనుచరానాధిరాజ్యాదికం వా**
**కాలే దృష్ట్వా కమలవసతే రప్యకించిత్కరాణి |**
**పద్మాకాంతం ప్రణిహితవతీం పాలనే ఽనన్యసాధ్యే**
**సారాభిజ్ఞా జగతి కృతినః సంశ్రయంతే దయే త్వామ్ ॥**

దయాదేవీ! అన్నిటిలోనూ చాలా ఉన్నతమైనది బ్రహ్మపదవి. బ్రహ్మ అన్నిటినీ సృష్టించేవాడు. అండాధిపతిగా ఉండేవాడు. శివుడు, ఇంద్రుడు మొదలైన అందరు దేవతల కంటే ఉన్నతుడు. భగవంతుని తిరునాభీకమలంనుండి ఉద్భవించినవాడు. ఇతని ఆజ్ఞ చెల్లని చోటు లేదు. ఇతని కీర్తికి అంతు లేదు. సంపద అవధి లేనిది. అందరూ దేవతలు ఇతనికి సేవ చేస్తారు. ఈ విధంగా అన్ని విధాలైన గొప్పతనాలతో ఇతని పరిపాలన సాగుతున్నది. అయితే, ఇంతటి గొప్పతనం కూడా బ్రహ్మకు

ఈ అధికారం ఉంటేనే కదా, ఉన్నంతవరకే కదా ఉంటుంది. ఈ స్థానం పొందడానికి కారణమైన పుణ్యం ఈ గొప్పతనాలను కలిగించి క్రమంగా నశించిపోతుంది కదా. వెంటనే ఇతడు ఈ అధికారాన్ని పోగొట్టుకుంటాడు. అంతటితో ఇంతకు ముందు చెప్పిన అన్ని గొప్పతనాలు ఇంతకుముందు ఉన్న చోటు తెలియని రీతిలో అదృశ్యమైపోతాయి. ఒకానొక సమయంలో వేదాలను పోగొట్టుకొని బ్రహ్మ తపించాడు కదా. అప్పుడు భగవంతుడు తానే వాటిని తిరిగి తీసుకొని వచ్చి రక్షించవలసినట్లయినది. అంత గొప్పతనాన్ని కలిగిన బ్రహ్మకే ఇటువంటి స్థితి వచ్చేటప్పుడు, ఇక మిగిలినవారిని గూర్చి చెప్పవలసిన ఆవశ్యకత ఉన్నదా? అందుచేత, సంసార లోకంలో ఎంతటి గొప్పతనాలు కలిగినప్పటికీ, అవి ఒక సమయంలో నశించిపోవలసినవే. ఈ వాస్తవాన్ని గమనించి తెలిసినవారు కొందరు భాగ్యవంతులు. వారు ఇవి అన్ని అసారమైనవి అని పక్కకు గెంటి, సారమైన కార్యాలను పరిగ్రహించే వివేకాన్ని పొందుతారు. అందుచేత వారు నిన్నే ఆశ్రయిస్తున్నారు. దీనికి ఏమి కారణం? లోకాన్ని రక్షించడం అనే కార్యం భగవంతునకు తప్ప ఇంకొకరికి సాధ్యం కాదు. శ్రీనివాసుడు, లక్ష్మీదేవి రక్షించడం అనే కార్యాన్ని సరిగా నిర్వర్తించగలిగేటట్లు నీవే ఆజ్ఞాపిస్తున్నావు. నీవల్లనే భగవంతుడు లోకాన్ని అంతటిని రక్షిస్తున్నాడు. ఈ వాస్తవాన్ని తెలిసికొనే, నిన్నే ముఖ్యంగా భావించి ఆశ్రయిస్తున్నారు, పుణ్యశాలురు. నిన్ను ఆశ్రయిస్తే ఏనాడు నశించని మోక్షానందాన్ని పొందవచ్చు అనే సారార్థాన్ని వారు గ్రహిస్తున్నారు.

**42) ప్రాజాపత్యప్రభృతివిభవం ప్రేక్ష్య పర్యాయదుఃఖం**
**జన్మాకాంక్షన్ వృషగిరివనే జగ్ముషాం తస్థుషాం వా |**
**ఆశాసానాః కతిచన విభో స్త్వత్పరిష్వంగధన్యైః**
**అంగీకారం క్షణమపి దయే హార్దతుంగై రపాంగైః ॥**

దయాదేవీ! మహావివేకులై, పరమభక్తులై ఉండే కులశేఖరాళ్వార్లవంటి కొందరు పెద్దలు ఉన్నారు. వారు బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారి ఐశ్వర్యం మొదలైనవాటిని అన్నిటిని, అవి పేరుకు మాత్రమే గొప్పవి– అనే విషయాన్ని గమనించారు. వాస్తవాన్ని వారు గమనించి తెలుసుకొని, ఆ సంపదలు అన్నీ ఆ రూపాన్ని పొందిన దుఃఖాలే– అని తెలుసుకున్నారు. బ్రహ్మ వేదాన్ని పోగొట్టుకొని తపించడం, ఇంద్రుడు అసురుల దగ్గర బాధలను పడడం మొదలైనవాటిని తలచి చూచినప్పుడు, ఆ సంపదలు దుఃఖ రూపాలుగానే పర్యవసిస్తున్నాయి. అందుచేత, మహానుభావులకు వాటిలో కొంచెం కూడా ఆశ అనేది కలగడం లేదు. వారు శ్రీ వేంకటాద్రిలో ఉండే ఒక అడవిలో పిచ్చుక, చేప మొదలైన జంగమ వస్తువులుగా అయినా, నది, వృక్షం మొదలైన స్థావర వస్తువులుగా అయినా జన్మను పొందాలని ఆశపడ్డారు. ఈ జన్మ మహిమను పొందడాన్నిబట్టి బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారి సంపద కంటే చాలా గొప్పది అని తెలిసి కొన్నారు. దీనికి ఏమి కారణం? తిరుమలలో ఏదైనా ఒక వస్తువుగా జన్మిస్తే, శ్రీనివాసుని మిక్కిలి ప్రేమను కలసిన కటాక్షాలు ఎప్పుడైనా,

క్షణకాలమైనా తమపై పడే అవకాశం ఉంటుంది కదా. ఆ కటాక్షలలో నీవు కూడా కలసి ఉన్నందున, అవి చాలా గొప్పవి కదా. నీవు కలసిన కటాక్షాలను పొందితే శ్రీ వేంకటనాథుడు ప్రేమతో అనుగ్రహించినట్లు అవుతుంది కదా. ఈ కృపా కటాక్షాన్ని పొందడానికి యోగ్యతను పొందడంకోసమే వారు తిరుమలలో ఉండే అరణ్యంలో జన్మను పొందాలని కోరుకుంటున్నారు.

**43) నాభీపద్మస్ఫురణసుభగా నవ్యనీలోత్పలాభా**
**క్రీడాశైలం కమపి కరుణే వృణ్వతీ వేంకటాఖ్యమ్ |**
**శీతా నిత్యం ప్రసదనవతీ శ్రద్ధధానావగాహ్యా**
**దివ్యా కాచిజ్జయతి మహతీ దీర్ఘికా తావకీనా ॥**

లోకంలో ఒక మహారాణి వినోదంగా కాలం గడపడానికి పర్వతం పైకి వెళ్లి విహరించడం అలవాటు. ఆ పర్వతంలో పెద్ద సరస్సు ఉంటుంది. అందులో కొత్త కొత్తగా నల్ల కలువ పువ్వులు, తామర పువ్వులు వికసించి ఆ సరస్సుకు అందాన్ని కలిగిస్తాయి. స్వచ్ఛమైన నీరు అందులో నిండుగా ఎల్లప్పుడూ చల్లగా ఉంటుంది. ఆ సరస్సులోని గొప్పతనాన్ని చూసి జనాలు ఆశతో వచ్చి, అందులో స్నానం చేసి వెడతారు. దయాదేవీ! శ్రీనివాసుని పట్టణ రాణి అయిన నీవు ఉత్సాహంగా కాలక్షేపాన్ని చేయడానికి శ్రీవేంకటమనే ఉన్నతమైన పర్వతం ఒకటి ఉన్నది. అందులో నీకు ఉపయోగపడడానికి తగిన భగవంతుని తిరుమేనియే ఒక పెద్ద, ఉన్నతమైన సరస్సు అవుతున్నది. ఈ సరస్సులో ఉండే

తిరునాభీకమలం వికసించి ఉన్నది. ఈ తిరుమేనిలో వ్యాపించి ప్రవహించే నల్లని వర్ణం నూతనమైన నల్లని కలువ పూలు పూచి ప్రకాశించినట్లుగా సాక్షాత్కరించడం తిరుమేని అందాన్ని వృద్ధి చేస్తున్నది. ఈ తిరుమేని సేవించేవారి కన్నులకు చక్కని విందుగా, చల్లగా ఉన్నది. తనను సేవించే జనులను అనుగ్రహించడానికి తగివున్నది. శ్రద్ధను కల జనులు ఎల్లప్పుడూ అనుభవించే తమ తాపాన్ని తీర్చుకోవడానికి తగినదిగా ఉన్నది. ఇటువంటి భగవంతుని తిరుమేని అనే సరస్సు నీకు తగినదై, మిక్కిలి గొప్పతనంతో వెలుగుతున్నది.

***44) యస్మిన్ దృష్టే తదితరసుఖై ర్గమ్యతే గోష్పదత్వం***
***సత్యం జ్ఞానం త్రిభిరవధిభి ర్ముక్తమానందసింధుమ్ ।***
***త్వత్స్వీకారాత్ తమిహ కృతినః సూరిబృందానుభావ్యం***
***నిత్యాపూర్వం నిధిమివ దయే నిర్విశంత్యంజనాద్రౌ ॥***

దయాదేవీ! శ్రీనివాసుని స్వరూపం ఏనాడు మార్పును పొందనిది. అచేతన వస్తువులవలె రూపంలో దానికి మార్పు లేదు. ఆత్మకు ఉన్నట్లుగా స్వభావంలో మార్పు లేదు. అతని స్వరూపం ఎల్లప్పుడూ జ్ఞానరూపంగానే ప్రకాశిస్తుంది. అతనిని "ఇక్కడ ఉన్నాడు, ఇక్కడ లేడు" అని దేశాన్ని పురస్కరించుకొని పరిచ్ఛేదించడం సాధ్యం కాదు. "ఈ సమయంలో ఉన్నాడు, ఆ సమయంలో లేడు" అని కాలాన్ని పురస్కరించుకొని పరిచ్ఛేదించడం సాధ్యం కాదు. "ఈ వస్తువు రూపంలో ఉన్నాడు, ఆ వస్తువు రూపంలో లేడు" అని వస్తువుతో కూడా

పరిచ్ఛేదించడానికి సాధ్యం కాదు. అన్నిచోట్ల, అన్ని కాలాలలో, అన్ని విధాలయిన రూపాలలో అతడు ప్రకాశిస్తున్నాడు. అంతు లేని ఆనందసముద్రమై ఉన్నాడు. నిత్యసూరులు, ముక్తులు నిరంతరంగా అతనిని దర్శించి ఆనందిస్తూ ఉన్నారు. ఎంత కాలం అనుభవించినా, ఎప్పటికప్పుడు నూతనంగా తోచి, మనసు ఆకర్షిస్తున్నాడు. ఇటువంటి భగవంతుని అనుభవించగలిగితే ఇక సకల సుఖాలు, బ్రహ్మలోకంతో పాటుగా, చాలా అల్పంగా తోస్తాయి. సముద్రాన్ని దర్శించినవానికి గోష్పాదంలో నిలచిన నీటిని చూసినట్టుగా, మిగిలిన సుఖాలు అంత పరిమితిలో అల్పంగా తోస్తాయి. ఈ విధంగా భగవంతుని అనుభవించడానికి కరుణ అనే నీవు మనస్సు పెట్టాలి. చేతనులను నీవు పరిగ్రహిస్తే వారు చాలా భాగ్యవంతులు అవుతున్నారు. ఇటువంటి పుణ్యశాలురు శ్రీవేంకటాచలంపై నీ సహాయంతో శ్రీనివాసుని ఒక నిధిగా పొంది, అనుభవించగలుగుతున్నారు.

***45) సారం లబ్ధ్వా కమపి మహతః శ్రీనివాసాంబురాశేః***
***కాలే కాలే ఘనరసవతీ కాళికేవానుకంపే |***
***వ్యక్తోన్మేషా మృగపతిగిరౌ విశ్వమాప్యాయయంతీ***
***శీలోపజ్ఞం క్షరతి భవతీ శీతళం సద్గుణౌఘమ్ ॥***

లోకంలో మేఘాలు మహాసముద్రంనుండి నీటిని గ్రహించి పీల్చి, నీటితో నిండుగా ఉండేవియై, పర్వతం పైకి వచ్చి నిలచి, చల్లని వర్షాన్ని కురిపించి, తగిన కాలంలో గొప్ప ప్రవాహంతో లోకాన్ని చల్లబరచి,

ఆనందింప చేస్తాయి. ఎత్తు, పల్లం అనే ఏ విధమైన తేడాలను చూడకుండా అన్నిచోట్ల సమంగా నీటిని వర్షిస్తాయి. ఓ దయాదేవీ! నీవు అటువంటి మేఘంవంటిదానవు. ఔన్నత్యం, నైచ్యం మొదలైన తేడాలను ఏమీ చూడకుండా, అందరి విషయంలో ప్రేమను కలిగి ఉన్నావు. శ్రీనివాసుడు అనే మహా సముద్రంనుండి ఆ స్వామికి కల ఉన్నతమైన గుణాలను గ్రహించి, నీ వశం చేసుకున్నావు. తిరుమలగిరిపై నిలచి ఉన్నావు. నీ కార్యాల వల్ల లోకం అంతా క్షేమాన్ని పొందాలి అని భావిస్తున్నావు. ఆ యా సమయాలలో చేతనులపై భగవంతుని సౌశీల్యం, సౌలభ్యం, వాత్సల్యం మొదలైన గుణాలు అనే మహాప్రవాహాన్ని ప్రవహింప చేస్తున్నావు.

సౌశీల్యం అంటే– చాలా గొప్పవాడుగా ఉండేవాడు చాలా తక్కువవాడుగా ఉండేవానితో ఏ విధమైన తేడా లేకుండా కలసి మెలసి ఉండే స్వభావం. సౌలభ్యం అంటే– భక్తులు తనను సులభంగా దరిచేరేటట్లుగా సులభుడై ఉండే స్వభావం. వాత్సల్యం అంటే– భక్తులలో ఉండే దోషాలను గ్రహించకుండా, చూడకుండా ఉండే వారిపై కలిగిన ప్రేమ. ఇటువంటి భగవంతుని గుణాలు జీవులకు ఉపయోగపడేటట్లు దయాగుణమైన నీవే చేస్తున్నావు. నీవు లేకపోతే ఆ గుణాలు స్థైర్యాన్ని పొందవు కదా.

శ్రీవేంకటాద్రిపై ఉండే ఏడు పర్వతాలలో సింహాద్రి కూడా ఒకటి.

ఈ క్రింది తాత్పర్యాన్ని కలిగిన పూర్వాచార్యుల సూక్తికి కూడా ఈ శ్లోకం అన్వయిస్తుంది అని అంటారు. ఆ తాత్పర్యం ఏమంటే–

నమ్మాళ్వార్లు అనే మేఘం భగవంతుడు అనే గొప్ప సముద్రంనుండి అతని కరుణ అనే నీటిని గ్రహించింది. ఆ నీటిని నాథముని అనే పర్వతంపై వర్షించింది. ఆ నీరు పుండరీకాక్షులు, శ్రీరామ మిశ్రులు అనే రెండు ప్రవాహాలై ప్రవహించింది. తరువాత ఆ రెండు ప్రవాహాలు ఆళవందార్ అనే నదిలో చేరింది. ఆ నది శ్రీభాష్యకారులు అనే తామర పూల తటకంలో పోయి చేరింది. ఆ తటకల్లో ఉండే నీరే ప్రాణులు అనే సస్యాలలో ప్రవహించి, వాటిని అభివృద్ధి చేసి, లోకాన్ని ఉజ్జీవింపజేస్తున్నది.

*46) భీమే నిత్యం భవజలనిధౌ మజ్జతాం మానవానాం*
*ఆలంబార్థం వృషగిరిపతి స్త్వన్ని దేశాత్ ప్రయుంక్తే /*
*ప్రజ్ఞాసారం ప్రకృతిమహతా మూలభాగేన జుష్టం*
*శాఖాభేదైః సుభగ మనఘం శాశ్వతం శాస్త్రపాణిమ్ //*

లోకంలో తిమింగలాలు మొదలైన నీటి ప్రాణులు నిండుగా ఉండే సముద్రం చాలా భయంకరంగా ఉంటుంది. అందులో ఒకడు దిగి బయటకు రాలేక బాధపడుతూ ఉన్నప్పుడు అతనికి చేయూతను ఇచ్చి లేవనెత్తి తీరాన్ని చేర్చాలి. అందుకోసం పైకెత్తాలని ప్రయత్నించేవాని బాహువులు బలంగా, తగిన విధంగా ఉండాలి. దీనితో పాటు, ఆ చేతి వేళ్ళు కూడా తగిన బలాన్ని కలిగి ఉండాలి. ఇన్ని అంశాలను కలిగిన చేతితో మాత్రమే సముద్రంలో పడినవానిని పైకెత్తడం సాధ్యమవుతుంది. దయాదేవీ! లోకంలో ఉండే మానవులు అనేక విధాలుగా భయంకరమైన

సంసారం అనే సముద్రంలో చిక్కుకొని, అల్లాడుతున్నారు. వారి కష్టాన్ని చూచి సహించలేని నీవు వీరికి చేయూతను ఇచ్చి పైకెత్తి తీరాన్ని చేర్చే విధంగా శ్రీ వేంకటేశ్వరుని ఆజ్ఞాపిస్తున్నావు. నీ ఆజ్ఞకు లోబడి అతడు వేదం అనే చేతితో వారిని పైకెత్తుతున్నాడు. ఆ విధంగా భగవంతుడు ప్రసాదించిన వేదాన్ని అధ్యయనం చేసినందువల్ల కలిగే వివేకమే వేదంయొక్క ముఖ్యమైన ప్రయోజనం. ప్రణవం అనే అక్షరమే వేదంలో మొదటిది కనుక అది మూలభాగంవంటిది. ఆ ప్రణవంలోని గొప్పతనం సాటి లేనిది. అన్ని అక్షరాలకు ఆదియై, భగవంతుని తెలిపేదిగా ఉండే ఆకారం ప్రణవంలో చేరి ఉన్నందున, ఆ ప్రణవంలోని గొప్పతనం ఇంకా మించి ఉన్నది. చేతికి పలు వేళ్ళు ఉన్నట్లే, వేదానికి ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలనే క్రమంలో అనేక విధాలైన శాఖలు ఉన్నాయి. అధ్యయనం చేయడానికి, వినడానికి మధురంగా ఉండేదై, ఏ విధమైన దోషం లేనిదచ, శాశ్వతమై ఉండే వేదం అనే చేతిని ఇచ్చి సంసార సముద్రంనుండి శ్రీనివాసుడు సంసారులను తీరానికి చేరుస్తున్నాడు. ఆ వేదాన్ని అధ్యయనం చేసి, దానిలోని అర్థాలను తెలుసుకొని, జనులు దాని ఆజ్ఞానుసారంగా ప్రవర్తించి, ప్రపత్తిని చేసి, సంసార బంధం పోగొట్టుకొని, మోక్షానందాన్ని పొందుతున్నారు. ఈ విధంగా వేదం అనే శాస్త్రాన్ని లోకానికి అతడు ఇచ్చేటట్లు నీవే అతనిని ఆజ్ఞాపిస్తున్నావు.

ఈ శ్లోకంలో ఉండే పదప్రయోగ విన్యాసాన్ని నిశితంగా గమనిస్తే ఆళ్వారుల దివ్య ప్రబంధాలు కూడా శ్రీదేశికుల మనసులో స్ఫురించి

ఉంటాయి అని భావించిన పెద్దలు ఇక్కడ ఈ క్రింది విధంగా కూడా భావాన్ని గ్రహిస్తారు.

కులపతి అయిన నమ్మాళ్వార్లు అందరికీ హితాన్ని కలిగించేది అయిన ద్రావిడభాషలో ప్రజ్ఞాసారమై, సహజంగానే గొప్పతనాన్ని కలిగినదై, ప్రకృతి అనే పదంచేత పెద్దది అయిన వేదానికి మూలమైన ప్రణవంతో కూడిన ఉద్దీథం అనే భాగంతో చేరినది, బ్రాహ్మణులకు మూలమైన సామవేదానికి చెందిన వేయి శాఖలతో గొప్పతనాన్ని పొందినది, అందమైనది అయిన తిరువాయ్ మొళి అనే, శాస్త్రరూపంలోని చేతిని ఇచ్చి, సంసారులను సంసార సముద్రం నుండి ఉద్ధరిస్తున్నారు.

ఈ విధంగా సంసార సముద్రంలో మునిగి ఉండే జీవులను చేయూతను ఇచ్చి ఉద్ధరించడం కోసం నమ్మాళ్వారులు కరుణ అనే నీ ఆజ్ఞచేత ప్రజ్ఞాఫలమై, సామవేదసారమైన తిరువాయ్ మొళి అనే నశించని శాస్త్రాన్ని అన్ని జాతులవారికి తగినట్లు ద్రావిడ భాషలో అనుగ్రహించారు —అనే తాత్పర్యాన్ని ఇక్కడ గ్రహించాలి.

***47) విద్వత్సేవాకతకనికషై ర్వీతపంకాశయానాం***
***పద్మాకాంతః ప్రణయతి దయే దర్పణం తే స్వశాస్త్రమ్ ।***
***లీలాదక్షాం త్వదనవసరే లాలయన్ విప్రలిప్సాం***
***మాయాశాస్త్రాణ్యపి శమయితుం త్వత్ప్రపన్నప్రతీపాన్ ॥***

ఒక పెద్ద పాత్రలో చాలా మలినాలతో కలత చెందిన నీరు నిండుగా ఉంటే, ఆ నీటిని తేటగా చేసే చిల్లగింజను ఆ నీటిలో కలిపితే, అ మురికి

మొత్తం ఒక పక్కకు తొలగిపోయి, స్వచ్ఛమైన నీరు పైకి వస్తుంది. అప్పుడు ఆ నీటిని పొందవచ్చు. చేతనుల మనసే ఒక పాత్ర. అజ్ఞానం, పాపం చేయడంలో రుచి మొదలైనవి ఆ పాత్రలో చేరిన మలినాలు. జ్ఞానులను ఆశ్రయించి, వారిని సేవించాలని ప్రయత్నించడమే చిల్లగింజతో ఆ నీటిని తేర్చడం. తమ మనసులో ఉండే అజ్ఞానం మొదలైనవి మహానుభావులైన భాగవతులను ఆశ్రయించి, వారిని సేవించాలనే ప్రయత్నిస్తే తీరిపోతాయి. మనసు తేటబడుతుంది. తత్వాలను యథాతథంగా తెలుసుకోవడానికి వీలవుతుంది. పాపాలను చేయడంలో అభిప్రాయం ఇక అప్పుడు కలుగదు. ఈ విధంగా మనస్సులో పవిత్రతను పొందిన భక్తులకు భగవంతుని గూర్చిన ఇంకా విశేషమైన జ్ఞానం కలగాలి కదా. ఈ జ్ఞానాన్ని వేదం నుండి మాత్రమే పొందడం సాధ్యం కాదు. వేదాలలోని యథార్థాలను తెలియడం సులభం కాదు. అందుచేత వాటి అర్థాలను తెలిసికొని, విశేషమైన జ్ఞానాన్ని పొందడానికి ఇంకా కొన్ని గ్రంథాలు ఆవశ్యకమైనవి. అందుకోసం శ్రీనివాసుడు తానే ఒక శాస్త్రాన్ని రచించాడు, అది ఏమంటే, శ్రీపాంచరాత్రం అని, భగవచ్ఛాస్త్రం అని వ్యవహరింపబడే శాస్త్రమే. ఈ శాస్త్రం నీ ఆజ్ఞతో అవతరించి, నీ గొప్పతనాన్ని అంతటిని వివరిస్తున్నందున నిన్ను తెలుపగలిగిన ఒక అద్దంవంటిది అవుతున్నది. ఈ శాస్త్రసహాయంతో భాగవతోత్తములు భగవంతుని గూర్చి స్పష్టమైన జ్ఞానాన్ని పొంది ప్రకాశిస్తున్నారు. ఇవి అన్నీ దయాదేవివి అయిన నీ వల్లనే సంభవిస్తున్నవి కదా.

అయితే, ఈ విధంగానే భగవంతుడు కొన్ని మాయా శాస్త్రాలను కూడా వ్యక్తం చేశాడు. అందులో దయాదేవి అయిన నీకు నేరుగా సంబంధం లేదు. నీవు కొంచెంసేపు భగవంతుని వదిలిపెట్టి బయటకు పోయినప్పుడు, అతనికి ఒక ఆశ కలిగింది. ఆసుర స్వభావాన్ని కలిగినవారిని వంచించడం అనేదే ఆ ఆశ. ఈ ఆశను మంచిదని గ్రహించి భావించి, దీనిలో అతడు ఆసక్తుడయ్యాడు. లోకంలో ప్రభువు కూడా, తన దగ్గర పట్టమహిషి లేని కాలాన్ని గమనించి, విలాసకాంతలతో ఆశపడి ఆనందాన్ని పొందడంవంటిదే, భగవంతుడు చేసే ఈ లీల. ఇది కూడా ఆవశ్యకమైనదే. నిన్ను శరణు పొందిన భక్తులకు శత్రువులై ఉండేవారు కొందరు ఉన్నారు. వారు భగవంతుని శత్రువులే కదా. వారిని దండించడం అనేది అతని కర్తవ్యం అయినది. అందుకోసం భగవంతుడు కొన్ని మోహన శాస్త్రాలను వ్యక్తం చేశాడు. ఆ శాస్త్రాలు వేదం తెలియజేసే వాస్తవమైన అర్థాలను మరుగుపరిచి, దానికి విరుద్ధమైన అర్థాలను చూపగలిగినవి. ఆ శత్రువులు వాటిని తెలుసుకొని, నమ్మి మోసపోయి, ధర్మాన్ని విడచిపెట్టి, అధర్మాన్ని గ్రహించి, చివరికి నరకంలో చిరకాలం పడి ఉంటారు. దీనికి అంతటికి భగవంతుడు చేసే ఆ లీలయే కారణం. ఇది అంతా ఆ భగవంతుని లీలయే అవుతున్నది. ఈ విధంగా అతనికి వంచించడంలో ఏర్పడిన కోరిక ఇటువంటి లీలలను అతడు చేసేటట్లు చేస్తున్నది. తరువాత, వీటిని అన్నిటిని తెలుసుకున్న నీవు, భగవంతుడు చేసే ఈ పనులన్నీ నీ భక్తుల శత్రువులను దండించే కార్యాలై

ఉన్నందున, అతని ఈ కార్యాలను చూసినా, చూడనట్లుగా ఉండవలసి వచ్చింది.

*48) దైవాత్ ప్రాప్తే వృషగిరితటం దేహిని త్వన్ని దానాత్*
*స్వామిన్ పాహీత్యవశవచనే విందతి స్వాప మంత్యమ్ /*
*దేవః శ్రీమాన్ దిశతి కరుణే దృష్టి మిచ్ఛం స్త్వదీయామ్*
*ఉద్ఘాతేన శ్రుతిపరిషదా ముత్తరేణాభిముఖ్యమ్ //*

దయాదేవీ! ఒకడు తిరుమలగిరికి వెళ్లడానికి చాలా పుణ్యం చేసి ఉండాలి. అది కలగడం కూడా నీ వల్లనే జరుగుతుంది. ఈ విధంగా పుణ్యాన్ని పొందిన ఒకడు తిరుమలకు వెళుతున్నాడు. అతనికి అప్పుడు మరణ కాలం సమీపిస్తున్నది అని అనుకుందాం. అతడు నోటి నుండి "స్వామీ! రక్షించు" అనే రెండు మాటలు బయటికి వస్తున్నాయి. ఆ మాటలు రావడానికికూడా నీవే కారణం అవుతున్నావు. అతడు భగవంతుని భావించి, మంచి భావనతో ఆ పదాలను చెప్పలేదు. ఇంద్రియాలు క్షీణించి, వయస్సు మించిన దశలో ఆ పదాలను అతడు అనుకోకుండానే అన్నాడు. అతని నోటినుండి అప్రయత్నంగానే అవి వచ్చాయి. వెంటనే అతనికి సమాధానం లభిస్తున్నది. ఎటువంటి సమాధానం? ఈ మాటలను విన్న వెంటనే, శ్రీవేంకటేశ్వరుడు, లక్ష్మీదేవి తాము స్వయంగా అతనికి ఎదురుగా ప్రణవాన్ని పలుకుతూ వచ్చి సాక్షాత్కరిస్తారు. "ఓం" అనే ఆ పదానికి "ఆ విధంగానే చేస్తాము "అని అర్థం ఉన్నది కదా. అన్ని వేదాలకు మూలమైన, మొదటి అక్షరమైన

ప్రణవాన్ని గ్రహించి కదా శ్రీనివాసుడు అతనికి సమాధానాన్ని ఇచ్చాడు. ఎదురుగా వచ్చి నిలచి అతడు చెప్పే ఆ ప్రణవం అతనికి కర్ణ మంత్రమైనది కదా. ఈ విధంగా శ్రీనివాసుడు చేయడం ఎందుకోసం? దయాదేవి అయిన నీ కటాక్షాన్ని పొందాలని ఆశ పొందినందువల్లనే అతని విషయంలో భగవంతుడు ఆ విధంగా అనుగ్రహించాడు. నీవు శ్రీనివాసుని చల్లని మనసుతో కటాక్షిస్తావు. ఈ విధంగా గొప్ప రీతిలో ఆ చేతనునకు తిరుమలలో మరణం సంభవించడం అనేది త్వరగా అతడు మంచి గతిని పొందడానికి సహాయపడుతున్నది కదా. ఇది అంతా ఆ క్షేత్రంలోని మహిమవల్ల, నీ సహాయంలోని మహిమవల్ల సంభవించింది.

*49) శ్రేయఃసూతిం సకృదపి దయే సమ్మతాం యః సఖీం తే*
*శీతోదారామలభత జనః శ్రీనివాసస్య దృష్టిమ్ /*
*దేవాదీనా మయ మనృణతాం దేహవత్వేఽ పి విందన్*
*బంధాన్ముక్తో బలిభి రనఘైః పూర్యతే తత్ప్రయుక్తైః ॥ 49 ॥*

దయాదేవీ! మానవుడు పుట్టేటప్పుడే అతనిపై భగవంతుని కటాక్షం పడాలి. ఇదే జాయమాన కటాక్షం అని అనబడుతున్నది. దీనిని పొందడానికి ముందు జన్మలో అతడు మంచి పుణ్యాన్ని చేసి ఉండాలి. ఈ కటాక్షం పడితే సత్వగుణం తల ఎత్తి, ఆచార్య సంబంధం కలిగి, మోక్షంలో అభిప్రాయం ఏర్పడి, దానిని పొందే దారి అన్వేషించేటట్లు చేస్తుంది. తరువాత మోక్షానికి ఉపాయమైన ప్రపత్తిని జీవుడు చేస్తున్నాడు. మోక్షానికి మించిన మంచి ఏమీ లేదు. దీనికి కారణమైన శ్రీనివాసుని

కటాక్షం ఒకనిపై పడాలి అంటే, ఈ కటాక్షం అతనిపై పడాలి, నీ ప్రేమకు తగిన సఖివంటిది, ఆ కటాక్షం. దయ అయిన నీవు ప్రసరించే చోటనే ఆ కటాక్షం కూడా ప్రసరిస్తుంది. ఆ కటాక్షం ఏద్దైనా ఒక జన్మలో ఒకసారి ఒకరిపై పడితే చాలు, అది అతనికి మోక్షం వరకు ఉండే హితాలను క్రమక్రమంగా కలిగిస్తుంది. ఆ కటాక్షం జీవుని దుఃఖాలను పోగొడుతున్నందున, చాలా చల్లనిదై ఉంటుంది. అన్ని విధాలైన ప్రయోజనాలను అనుగ్రహించడంచేత గొప్ప ఔదార్యాన్ని కలిగి ఉంటుంది. ఆ కటాక్షాన్ని పొంది భగవంతుని చరణాలలో ప్రపత్తిని చేసినవానికి కలిగే హితాలకు అంతులేదు. ఈ శరీరం ఉన్నప్పుడే అతనికి మూడు విధాలయిన ఋణాలు తీరిపోతున్నాయి. ఒక్కొక్క మానవులకు మూడు ఋణాలు ఉంటాయి. అవి ఏమంటే, దేవ ఋణం ఋషిఋణం పితౄణం అనేవి. దేవతల విషయంలో ఉండే ఋణం యజ్ఞయాగాలు చేయడం వల్ల, మునుల విషయంలో ఉండే ఋణం వేదాన్ని అధ్యయనం చేయడం వల్ల, పితృదేవతల విషయంలో ఉండే ఋణం మంచి సంతానాన్ని పొందడం వల్ల తిరిగి పోతున్నాయి. శ్రీనివాసుని కటాక్షాన్ని పొంది, మోక్షానికి ఉపాయమైన ప్రపత్తిని చేసినవానికి ఈ శరీరం ఉన్నప్పుడే ఈ అప్పులు అతడు ఆచరించిన ప్రపత్తియొక్క మహిమ చేత పూర్తిగా తీరిపోతున్నాయి. తగిన కాలంలో అతడు ఈ శరీరాన్ని విడచి పెట్టేటప్పుడు సంసార బంధం తొలగిపోయి, అర్చిరాదిగతిలో మోక్షానికి అతడు వెళుతున్నాడు. అప్పుడు దారిలో పూర్వం అతడు అప్పుపడిన దేవతలే "తమ తలరాత" అని భావించకుండా, చాలా ప్రీతితో అతనికి

ఉపచారాలను చేసి, గొప్ప గొప్ప కానుకలను అన్నిటిని అతనికి తీసుకొని వచ్చి సమర్పిస్తారు. ఈ విధంగా ఇంత గొప్పతనం అన్నిటికి కారణమైన శ్రీనివాసుని కటాక్షాన్ని పొందడంలో నీ సహాయమే కదా, ముఖ్యమై ఉన్నది.

*50) దివ్యాపాంగం దిశసి కరుణే యేషు సద్దేశికాత్మా*
*క్షిప్రం ప్రాప్తా వృషగిరిపతిం క్షత్రబంధ్వాదయ స్తే /*
*విశ్వాచార్యా విధిశివముఖాః స్వాధికారోపరుద్ధాః*
*మన్యే మాతా జడ ఇవ సుతే వత్సలా మాదృశే త్వమ్ // 50 //*

దయాదేవీ! నీవు గొప్ప ఆచార్యుని రూపాన్ని పరిగ్రహిస్తున్నావు. చేతనులకు నీవే ఆచార్య రూపాన్ని వహించి ఉపదేశించి, సద్గతిని పొందిస్తున్నావు. ఏ చేతనునకు నీవే ఆచార్య రూపాన్ని వహించి, నీ ఉన్నతమైన కటాక్షాన్ని ప్రసరింపచేసి అతడు ప్రపత్తిని చేసేటట్లు చేస్తున్నావో, వారు అందరూ వేగంగా శ్రీవేంకటనాథుడైన పరమపదనాథుని పొంది, మోక్ష సామ్రాజ్యాన్ని పొందుతున్నారు. ఉదాహరణంగా క్షత్రబంధువు అనే ప్రభువు క్రూరమైన పాపాలను చేస్తూనే ఉన్నాడు. అయినప్పటికీ, ఒక ఆచార్యుని ఆశ్రయించి, అతడు ఉపాయాన్ని ఆచరించి, మోక్షాన్ని పొందాడు. ఈ విధంగా ఇంకా అనేకమంది ఆచార్యుని ఆశ్రయించి, ప్రపత్తిని చేసి, ముక్తిని పొందారు. నీవే ఆచార్య రూపాన్ని పొందుతున్నావు. పాపులైనా, మేము, నీ కటాక్షం పొందినట్లయితే, ఈ జన్మలోనే ఉపాయాన్ని ఆచరించి, మోక్షాన్ని

పొందుతున్నాము. నీ కటాక్షాన్ని పొందకపోతే, ఎంతటి గొప్పతనాన్ని కలిగినవారు అయినప్పటికీ మోక్షం పొందడం వీలు కాదు. ఉదాహరణంగా, శాస్త్రాలను వ్యక్తం చేసి, లోకానికి అంతటికి ఉపదేశం చేసినవారు బ్రహ్మ, శివుడు మొదలైనవారు. వారు ఇంకా మోక్షం పొందలేదే! దానికి ఏమి కారణం? నీ కటాక్షాన్ని పొందకపోవడమే. వారు తమ తమ అధికారాలకు కట్టుబడి ఉన్నారు. అధికారం ఉన్నంతవరకు వారు మోక్షాన్ని పొందడానికి సాధ్యం కాదు. అధికారం పూర్తి కాగానే, వారు ఉపాయాన్ని ఆచరించి, నీ కటాక్షాన్ని పొందితే, తరువాత మోక్షం పొందవచ్చు. ఈ విధంగా క్షత్రబంధువు మొదలైన పాపులు కూడా నీ కటాక్షం చేత వేగంగా మోక్షం పొందడం సాధ్యమై ఉన్నది. కానీ బ్రహ్మ మొదలైన పెద్దలు కూడా మోక్షం పొందడానికి కారణమైన నీ కటాక్షం లేకుండా, కర్మకు వశపడి ఉన్నారు. ఈ రెండు విధాలయిన స్థితులను గమనించి ఆలోచించినప్పుడు, వాస్తవం స్పష్టంగా ప్రకాశిస్తుంది. లోకంలోకూడా, ఒక తల్లికి పలు పుత్రులు ఉన్నప్పటికీ, జ్ఞానం, శక్తి మొదలైనవానిని లేకుండా అసమర్థులై ఉండే పుత్రుల విషయంలోనే ప్రేమ మిక్కిలిగా ఉండి, ఆమె వర్తించడాన్ని మనం గమనిస్తున్నాము. ఆ విధంగానే క్షత్రబంధువు మొదలైనవారి విషయంలోకూడా. మేము మోక్షం పొందడానికి కావలసిన జ్ఞానం, శక్తి మొదలైన యోగ్యతను లేనివారమై, అపచారాలను చేసిన వారమై ఉన్నాము. ఏ విధమైన ఆలంబనం లేకుండా ఉండే మా స్థితికి నీవు బాధపడుతున్నావు. గొప్ప ఆచార్యరూపాన్ని పొందుతున్నావు. మమ్ములను సంస్కరించి,

శ్రీనివాసుని శ్రీచరణాలలో ప్రపత్తిని చేసేటట్లు చేస్తున్నావు. వేగంగా శ్రీవేంకటనాథుడు అనే పరమపదనాథుని పొందిస్తున్నావు. ఇది అంతా కూడా నీ కటాక్షంలోని గొప్పతనమే కదా.

***51) అతికృపణోఽపి జంతు రధిగమ్య దయే భవతీమ్***

***అశిథిలధర్మ సేతుపదవీం రుచిరామచిరాత్ |***

***అమితమహోర్మి జాల మతిలంఘ్య భవాంబునిధిం***

***భవతి వృషాచలేశపదపత్తననిత్యధనీ ॥ 51 ॥***

లోకంలో దరిద్రుడు ఒకడు గొప్ప సంపదను సంపాదించాలని అనుకుంటాడు. అతడు సముద్రాన్ని దాటి, ఆవలి తీరంలో ఉండే నగరం చేరి, సంపదను పొందాలని కోరుతాడు. పెద్ద పెద్ద కెరటాలు నిండి, భయాన్ని కలిగించే మహాసముద్రాన్ని అతడు ఏ విధంగా దాటడం? ఒక ప్రభువు పుణ్యాన్ని పొందాలని భావించి, సముద్రంలో ఒక స్థిరమైన, గట్టి వారధిని కట్టాడు. ఆ బీదవాడు ఆ వంతెన దారిలో సముద్రాన్ని దాటి, తాను కోరిన నగరాన్ని చేరి, గొప్ప సంపదను సంపాదించి, అక్కడే ఆనందంగా జీవిస్తున్నాడు.

ఆ విధంగానే, ఓ దయాదేవీ! చేతనుల దగ్గర తమను రక్షించుకునే యోగ్యత ఏమీ లేదు. అంటే, కర్మయోగాన్ని గాని. జ్ఞాన యోగాన్ని గాని, భక్తి యోగాన్ని కానీ, దేనిని చేసే జ్ఞానం, శక్తి లేదు. వారికి ధర్మస్వరూపుడైన భగవంతుని శ్రీచరణాలను పొందాలని, మోక్షాన్ని పొందాలనే చాలా బలమైన ఆశ ఉంది. సంసారాన్ని చూస్తే, అది ఒక పెద్ద సముద్రం. కామం, క్రోధం మొదలైన అంతులేని దుర్గుణాలు ఈ

సముద్రంలోని పెద్ద పెద్ద అలలు వలే ఉన్నాయి. ఇటువంటి క్లిష్ట స్థితిలో వారు ఏ విధంగా ఏమి చేయగలరు? అందువల్ల, నిన్ను శరణు పొందుతున్నారు. నీవు, మనస్సుకు మధురమైన, వ్యర్థం గాని ఒక వారధిపై, త్వరగా వారు జన్మ అనే మహాసముద్రం దాటేటట్లుగా చేస్తున్నావు. దాని ద్వారా వారు శ్రీ వేంకటేశ్వరుడు అనే పరమాత్మ యొక్క శ్రీచరణాలను పొందుతున్నారు. ఆ స్వామి శీచరణ సన్నిధి. వారు ఉజ్జీవించే గొప్ప నగరం అవుతున్నది. అక్కడ ఆ చరణాలకు నిత్య కైంకర్యం చేయడం అనే నశించని సంపదను పొంది, వారు ఆనందంగా తరిస్తున్నారు. ఈ విధంగా నిన్ను శరణు పొందినవారిని నీవు తరింప చేస్తున్నావు.

*52) అభిముఖభావసంపదభిసంభవినాం భవినాం*
*క్వచిదుపలక్షితా క్వచిదభంగురగూఢగతిః |*
*విమలరసావహా వృషగిరీశదయే భవతీ*
*సపది సరస్వతీవ శమయత్యఘమప్రతిఘమ్ ॥ 52 ॥*

సరస్వతి అనే పుణ్య నది చాలా స్వచ్ఛమైన నీటిని కలిగి ప్రవహిస్తున్నది. ఆ నదికి ఒక విశేషం ఉన్నది. కొన్నిచోట్ల దాని నీటి ప్రవాహం జనుల కంటికి కనిపిస్తుంది. కొన్ని చోట్ల కనిపించదు. భూమిలో అది అంతర్గతమై ఉంటుంది. వ్యక్తంగా బయటకు కనిపించే చోటను చూచి, అందులో స్నానం చేయాలనే ప్రయత్నించినవానికి అతనికి ఉండే మహాపాపాలు అన్ని వెంటనే తొలగిపోయి, పుణ్యం వృద్ధి అవుతుంది,

శ్రీవేంకటనాథుని దయాదేవీ! నీవు కూడా ఆ సరస్వతీనదివంటిదానివి. అన్ని ప్రాణుల విషయంలో పవిత్రమైన ప్రేమ అనే నీటిని ప్రవాహాన్ని ప్రవహించేటట్లు చేస్తున్నావు. అయినా, కొందరికి కొన్ని సమయాలలో స్పష్టంగా మంచిని కలిగిస్తున్నావు. కొందరి విషయంలో అదృశ్యంగా మంచిని కలిగిస్తున్నావు. అంటే, కొందరు భగవంతుని మనస్సు సంతోషించేటట్టు శాస్త్రాన్ని అనుసరించి నడుచుకుంటూ ఉన్నారు. వారి విషయంలో భగవంతుడు అనుకూలుడై, తన కటాక్షాన్ని వర్షిస్తున్నాడు. వారికి భగవంతుని ఈ మనఃస్థితి గొప్ప సంపదకదా. ఈ సంపదను పొందినవారికి స్పష్టంగా సకలక్షేమాలను నీవు కలిగిస్తున్నావు. కొందరు ముందు చేసిన కర్మల వాసనచేత తరువాత కూడా పాప కార్యాలను చేసి, భగవంతుని మనస్సు కలత పొందేటట్లు చేస్తున్నారు. వారి విషయంలో నీవు అదృశ్యంగా నిలచి సహాయపడుతున్నావు. ఏ విధంగా? అంటే, వారి పాపాలు తొలగిపోవడానికి కొన్ని ప్రాయశ్చిత్త కర్మలను వారిచే చేయించి అయినా, కొన్ని దండలను ఇచ్చి అయినా, త్వరగా వారి పాపాలను తీర్చి పవిత్రులను చేస్తున్నావు. వారు కొన్ని దుఃఖాలను అనుభవించేటట్లు చేస్తున్నావు. అది బయటకు చూసినప్పుడు వారికి హాని కలిగిస్తున్నట్లుగా తోస్తుంది. కాని, వారిని కూడా పవిత్రులుగా చేయడం కోసమే నీవు దండలను అనుభవింప చేస్తున్నావు. ఇది నీవు అదృశ్యంగా చేసే సహాయంగానే అవుతున్నది. ఏ విధంగా అయినా సంసారులకు భగవంతునకు అనుకూలంగా నడవాలి అనే పూర్తి అభిప్రాయాన్ని కలిగినవారై ఉండడంకూడా గొప్ప సంపదయే అవుతున్నది. వారిని నీవు

పవిత్రులను చేసి, ప్రపత్తిని చేసేటట్లుగా ప్రేరేపించి, వేరు దేనిచేతను తొలగిపోని పాపాలను తొలగిపోయేటట్లు త్వరగా చేసి, వారు మోక్షాన్ని పొందేటట్లు సహాయపడుతున్నావు.

***53) అపి కరుణే జనస్య తరుణేందువిభూషణతామ్***
***అపి కమలాసనత్వమపి ధామ వృషాద్రిపతేః /***
***తరతమతావశేన తనుతే నను తే వితతిః***
***పరహితవర్ష్మణా పరిపచేళిమకేళిమతీ ॥***

దయాదేవీ! నీవు లేని చోటు అనేది లేదు– అనే విధంగా అన్ని చోట్ల అంతటా వ్యాపించి ఉన్నావు. నీవు చేసే లీలలు అన్నీ జీవులకు మంచిని కలిగించేవిగానే అవుతున్నవి. నీవు చేతనులు చేసిన పుణ్యాలలో తారతమ్యానికి తగినట్లుగా వారికి ప్రయోజనాలను కలిగిస్తున్నావు. చేతనులు నీ వద్దనుండి పొందలేని ఫలాలు అనేవి ఏమీ లేవు. ఒకడు తన తాను శివుడుగా కావాలని కోరి, దానికి తగిన పుణ్యాన్ని చేస్తే, అతనిని శివునిగా చేస్తున్నావు. ఇంకొకడు శివుని కంటే గొప్పదైన బ్రహ్మ పదవిని పొందాలని కోరి, దాని కంటే మించిన పుణ్యాన్ని చేస్తే, అతనిని బ్రహ్మగా పుట్టిస్తున్నావు, ఒకడు పరిపూర్ణమైన వివేకంతో, ఈ స్థానాల అల్పత్వాన్ని, అస్థిరత్వాన్ని తెలుసుకొని, ఏనాడు నశించని మోక్షానందాన్ని కోరి, దానికి తగిన ఉపాయాన్ని ఆచరిస్తే, అతనికి శ్రీవేంకటనాథుడు అనే పరమపదనాథుని శ్రీ వైకుంఠాన్ని

అనుగ్రహిస్తున్నావు. ఈ విధంగా చేతములకు నీదగ్గర పొందలేని ప్రయోజనం అనేది ఏదీ లేదు.

***54) ధృతభువనా దయే త్రివిధగత్యనుకూలతరా***

***వృషగిరినాథపాదపరిరంభవతీ భవతీ |***

***అవిదితవైభవాఽ పి సురసింధురివాతనుతే***

***సకృదవగాహమాన మపతాప మపాపమపి ॥***

శ్రీనివాసుని దయా దేవీ! దేవగంగ తన పవిత్రమైన నీటితో లోకాన్ని పవిత్రం చేసి, పోషించే స్వభావాన్ని కలిగినది. ఆకాశం, భూమి, పాతాళం అనే మూడు చోట్ల దాని ప్రవాహాలు ప్రవహిస్తున్నాయి. త్రివిక్రముడై అవతరించిన శ్రీ వేంటనాథుని శ్రీచరణాలనుండి పుట్టినందున ఎల్లప్పుడూ ఆ శ్రీచరణాల సంబంధం పొందినది. ధర్మమే గంగగా ప్రవహిస్తున్నందున ధర్మంతో సంబంధాన్ని, శివుని తలలోని సంబంధాన్ని, దగ్గరలో ఉండే పర్వతాల సంబంధాన్ని కలిగినది, అది. దాని గొప్పతనాన్ని తెలియకుండా పోయినా, ఒకడు దాని నీటిలో ఒకసారి స్నానం చేస్తే చాలు, అతని శరీరంలో ఉండే తాపం తీరిపోవడమేకాక, అతనికి కల పాపాలు అన్ని నశించిపోతాయి. దయాదేవీ! నీవు అటువంటి దేవగంగను పోలి ఉన్నావు. లోకం అంతా వ్యాపించి జీవులను అందరినీ రక్షిస్తున్నావు. నీ పోకడ జీవులకు ఐశ్వర్యం, కైవల్యం, మోక్షం అనే మూడు విధాలైన ప్రయోజనాలను, వారి కోరికలకు తగినట్లు, అనుగ్రహించడానికి కారణం అవుతున్నది. శ్రీవేంకటేశ్వరుని శ్రీ చరణాలను

చేతనులు ఆశ్రయించిన వెంటనే, అతని కరుణ అయిన నీవు పొంగి, విజృంబించి పైకి లేస్తున్నావు. అందుకే శ్రీ వేంకటేశ్వరుని శ్రీచరణ సంబంధం నీకు ఉన్నది. ఒకడు నీ గొప్పతనాన్ని తెలియనివాడు అయినప్పటికీ, నీ విషయంలో ఒకసారి ప్రపత్తిని చేసినవాడైతే, అతని పాపాలు నశించి, సంసారతాపాలు అన్నీ పోయి, మోక్షానందాన్ని పొందేటట్లు నీవు చేస్తున్నావు. అందుచేత దేవగంగ వంటి దానవు, నీవు.

*55) నిగమసమాశ్రితా నిఖిలలోకసమృద్ధికరీ*
*భజదఘుకూలముద్రుజగతిః పరితప్తహితా/*
*ప్రకటితహంసమత్స్యకమఠాద్యవతారశతా*
*విబుధసరిచ్ఛ్రియం వృషగిరీశదయే వహసి ॥*

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! నీవు దేవగంగవంటి దానివే అనే విషయం ఇంకా కొన్ని సాక్ష్యాలు తెలుపుతున్నాయి. దేవగంగను వేదాలు కీర్తిస్తున్నాయి. పలు వృక్షాలతోకూడి ఆ నదీప్రవాహం ప్రవహిస్తుంది. దేవగంగ తన ప్రవాహంతో దేశం అంతా అభివృద్ధి చేస్తున్నది. దాని ప్రవాహం రెండు తీరాలను కూలగొట్టి ప్రవహిస్తుంది. అందులో స్నానం చేసినవారికి తాపాన్ని తీర్చి, మంచిని కలిగిస్తుంది. తన నీటిలో మత్స్యాలు, కూర్మాలు, హంసలు మొదలైన జంతువులను జన్మింప చేస్తుంది. వందలాది సంఖ్యలో రేవులను కలిగి ఉంటుంది. దయాదేవీ! నిన్ను కూడా వేదాలు చాలా కీర్తిస్తున్నాయి. ఇహలోక ప్రయోజనాలను కోరినవారికి వాటిని ఇచ్చి లోకం అంతా క్షేమం పొందేటట్లు నీవు

చేస్తున్నావు. నిన్ను శరణు పొందినవారి పుణ్యం, పాపం అనే రెండు విధాలైన కర్మలను లేకుండా చేస్తున్నావు. సంసార బంధంలో పడి తపించేవారికి ఆ తాపాన్ని పోగొట్టి, వారు మోక్షాన్ని పొందేటట్లు చేస్తున్నావు. భగవంతుడు నీ కారణంగానే భగవంతుడు హంస మత్స్య కూర్మాదిరూపాలలో ఎన్నో అవతారాలను ఎత్తాడు. వాటివల్ల లోకం అంతా హితాన్ని పొందుతున్నది. ఇంతటి మహిమలను కలిగిన నీవు ఈ విధంగా దేవగంగను పోలివున్నావు.

***56) జగతి మితంపచా త్వదితరా తు దయే తరళా***
***ఫలనియమోజ్ఝితా భవతి సంతపనాయ పునః /***
***త్వమిహ నిరంకుశప్రశకనాదివిభూతిమతీ***
***వితరసి దేహినాం నిరవధిం వృషశైలనిధిమ్ //***

దయాదేవీ! లోకంలో నీవే కాకుండా, వేరు ఎన్నో పేర్లను కలిగిన దయలు ఉన్నాయి. బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలకు కరుణ ఉన్నది. ప్రభువులు, గొప్పదనికులు మొదలైన పలువురకు కూడా దయ ఉన్నది. అయితే, వారి దయలు అంతా అల్పమైన ప్రయోజనాలనే ఇస్తాయి. అవి స్థిరంగా ఉండేవి కాదు. ఒకసారి ఉదయించి, ఇంకొక సమయంలో తొలగిపోతాయి. వాటిని నమ్మి ఉండడం సాధ్యం కాదు. అవి అల్ప లాలను ఇచ్చినప్పటికీ ఇవ్వవచ్చు, ఇవ్వకుండా కూడా పోవచ్చు. జనులు కొంచెం దోషం, పాపం చేసినా, ఆ కరుణయే కోపంగా మారి, పలు కష్టాలను వారికి కలిగిస్తుంది. శ్రీనివాసుని దయ అయిన నీ గొప్పతనం

అయితే, అత్యద్భుతమైనది. నీ శక్తి, సంకల్పం మొదలైనవానిని అడ్డు పెట్టడం ఎవరికి సాధ్యం కాదు. నీవు చలించకుండా, స్థిరంగా నిలచి ఉంటావు, నీవు భక్తులకు వారు కోరిన ఫలాలను తప్పక ఇచ్చి తీరుతావు. నీవు ఫలాలను ఇవ్వడాన్ని గూర్చి చేతనులకు సందేహం కలిగే అవకాశం లేదు. నీవు ఎటువంటి ప్రయోజనాన్ని ఇస్తున్నావు? తిరుమలలో ప్రకాశించే శ్రీనివాసుడనే అంతులేని గొప్ప నిధిని కదా, భక్తులకు అనుగ్రహిస్తున్నావు! నీవల్ల గొప్ప నిధికదా భక్తులకు వశం అవుతున్నది. ఈ విధంగా లెక్కలేనంత గొప్పతనాన్ని కలిగినని నీ ముందు నిలవడానికి కూడా మిగిలినవారి దయ యోగ్యతను కలిగి ఉన్నదా?

***57) సకరుణలౌకికప్రభుపరిగ్రహనిగ్రహయోః***

***నియతిముపాధిచక్రపరివృత్తిపరంపరయా /***

***వృషభమహీధరేశకరుణే వితరంగయతాం***

***శ్రుతిమితసంపది త్వయి కథం భవితా విశయః ॥***

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! లోకంలో ఉండే ప్రభువులు తమను జనులు సేవించి ఆరాధిస్తే, వారికి విశేషమైన అనుగ్రహాన్ని చేస్తారు. తమకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే, తగిన విధంగా దండనను విధిస్తారు. ఇందువల్ల వారిని కరుణ లేనివారని చెప్పడానికి వీలవుతుందా? వీలు కాదు. వారు కరుణను కలిగినవారే! మానవులు ప్రవర్తించిన దానికి తగినట్టు తాము ప్రయోజనాలను ఇస్తారు. ఈ వాస్తవాన్ని విజ్ఞులు బాగా

గ్రహిస్తారు. ఈ విధంగా మంచిని చేయడం, హానిని చేయడం అనే కారణాలు చక్రంవలె మారుతూ ఉంటాయి. వాటి ప్రయోజనాలు కూడా తప్పక కలుగుతాయి. వాస్తవాన్ని ఆలోచించి చూచి తెలిసినవారికి, నీ న్యాయమైన రీతిలో ఫలాన్ని ఇవ్వడంలో కొంచమైనా సందేహం కలుగుతుందా? ఏ సమయంలోనూ కలుగదు. నీ గొప్పతనాన్ని వేదాలన్నీ నోరు తెరిచి కీర్తిస్తున్నాయి. లోకంలో ఉండే ప్రభువులే ఋజువుగా నీతిని, న్యాయాన్ని అనుసరించి ప్రవర్తించేటప్పుడు, అందరికంటే గొప్పదానివి అయిన నీవు చేతనుల విషయంలో వారి నడుచుకున్న దానికి తగినట్లు, ధర్మాన్ని తప్పకుండా, ఫలాన్ని ఇవ్వడంలో సందేహం ఉంటుందా? అందుచేత, నీకు అనుకూలంగా నడిచినవారికి విశేషమైన అనుగ్రహాలను చేస్తున్నావు. విపరీతంగా ప్రవర్తించినవారికి దోషాలకు వారి తగినట్లుగానే, కొంచెం కూడా అధికంగా కాకుండా, నీవు వారికి ఈ విధంగా దండనలను విధించడంకూడా వారిని పవిత్రులను చేయడం కోసమే కదా.

***58) వృషగిరికృష్ణమేఘజనితాం జనితాపహరాం***
***త్వదభిమతిం సువృష్టిముపజీవ్య నివృత్తతృషః /***
***బహుషు జలాశయేషు బహుమాన మపోహ్య దయే***
***న జహాతి సత్పథం జగతి చాతకవత్ కృతినః //***

లోకంలో చాతకం అనే ఒక రకమైన పక్షి ఉన్నది. అది నదులు, చెరువులు మొదలైన జలాశయాలలో ఉండే నీటిని తాగదు. మేఘం

నుండి వచ్చే వర్షపు నీటిని మాత్రమే ఎదురు చూచి, ఆ నీటితోనే తన దాహాన్ని తీర్చుకుంటుంది. ఎల్లప్పుడూ ఆకాశంలో తిరిగుతుంది. శ్రీనివాసుని దయాదేవీ! అటువంటి చాతక పక్షివలె ఉండే కొందరు పుణ్యాత్ములు లోకంలో ఉన్నారు. శ్రీ వేంకట పర్వతంపై శ్రీనివాసుడు అనే నల్లని మేఘం ఒకటున్నది. కరుణ అనే నీవు చేతనులను " వీరు నన్ను ఆశ్రయించినవారు" అని అభిమానిస్తున్నావు. ఈ నీ అభిమానమే శ్రీనివాసుడు అనే మేఘంనుండి వచ్చే మంచి వర్షపు నీరు అవుతున్నది. ఆ ప్రేమ వర్షాన్ని పొందితే, సంసారతాపం అంతా తీరిపోతుంది. కొందరు పుణ్యాత్ములు దీనిని పొందాలని ఆశపడుతున్నారు. అందుకోసం వారు ప్రపత్తిని చేసి, యోగ్యతను పొంది, నీ ప్రేమవర్షాన్ని పొందుతున్నారు. దానివల్ల ఇంతవరకు తమ పాపాధిక్యంచేత మనసులో బాధపడడం అనే గొప్ప తాపాన్ని తీర్చుకున్నవారవుతున్నారు. ఈ విధంగా ఉన్నతమైన ప్రేమ జలాన్ని పొందిన తరువాత మిగిలిన అన్యదైవాలు అనే అన్య జలాశయాలను వీరు కన్నెత్తి కూడా చూడరు. తమ శరీరం ఉన్నంతవరకు ఈ పుణ్యాత్ములు నిత్య నైమితిక కైంకర్యాలను భగవద్భాగవత కైంకర్యాలను ఋజువుగా చేస్తూ, ఆకాశంలో తిరిగే చాతకపక్షి వలె ఏ విధమైన విచారం లేనివారై ఆనందంగా ఉంటారు. ఈ విధంగా వీరు ఉన్నతమైన స్థితిని పొందడానికి నీవే కారణం అవుతున్నావు.

***59) త్వదుదయతూలికాభి రమునా వృషశైలజుషా***
***స్థిరచరశిల్పినైవ పరికల్పితచిత్రధియః |***
***యతిపతియామునప్రభృతయః ప్రథయంతి దయే***
***జగతి హితం న నస్త్వ యి భరన్యసనాదధికమ్ ॥***

దయాదేవీ! శ్రీ వేంకటేశ్వరుడు స్థావర జంగమాలు అనే రూపంలో ఉండే లోకం అంతటియొక్క సృష్టిని చిత్రీకరించే ఒక విచిత్రమైన చిత్రకారుడు. ఇతడు చిత్రాన్ని నిర్మించడంలో సమర్ధుడు. అందులోనూ, మనస్సులో ఏనాడు నశించని చిత్రాన్ని అందంగా చిత్రీకరిస్తాడు. శ్రీభాష్యకారులు శ్రీ ఆళవందార్, నాథమునులు మొదలైన ఆచార్యుల భక్తి అనే గోడలో తత్వార్ధాలు అనే చిత్రాలను గొప్పగా ప్రకాశించేటట్లు చిత్రీకరిస్తున్నాడు, శ్రీనివాసుడనే ఈ చిత్రకారుడు. ఈ చిత్రాలను గీయడానికి లేఖన సాధనం కావాలి కదా. కరుణవు అయిన నీ యొక్క ఆవిర్భావాలే ఆ తూలికలు. ఈ విధంగా భగవంతుడు ఆచార్యులకు విశేష జ్ఞానాన్ని అనుగ్రహించడానికి కరుణ అయిన నీవే కారణం అవుతున్నావు. ఈ విధంగా భగవంతుని దగ్గర భక్తిరూపాన్ని పొందిన జ్ఞానాన్ని పొందినవారైనా, ఆచార్యులు ఉపదేశ పరంపరద్వారా, శ్రీసూక్తులద్వారా మన సిద్ధాంతాలలో ముఖ్యమైన తత్వాలను వ్యక్తం చేస్తున్నారు. వాటిలో మనకు చాలా ముఖ్యమైన సారార్థం ఏమిటంటే, భక్తియోగాన్ని చేసేవారికి తగిన జ్ఞానం, శక్తి మొదలైనవానిని పొందలేని మనకు మోక్షం పొందడానికి ని శ్రీచరణాలలో అనే భరన్యాసం అనే ప్రపత్తిని

కంటే ఇంకొక గొప్ప ఉపాయంలో వేరొకటి ఏమీ లేదు– అనేదే. దీనినే ఆచార్యులు మనకి ముఖ్యంగా ఉపదేశిస్తున్నారు.

*60) మృదుహృదయే దయే మృదితకామహితే మహితే*
*ధృతవిబుధే బుధేషు వితతాత్మ ధురే మధురే!*
*వృషగిరిసార్వభౌమదయితే మయి తే మహతీం*
*భవుకనిధే నిధేహి భవమూలహరాం లహరీమ్ ॥*

దయాదేవీ! నీ మనస్సు చాలా మృదువైనది. చేతనుల చిన్న దుఃఖాన్ని కూడా నీవు సహించలేవు. శాస్త్రాలను తెలుసుకొని, వాటిలో చెప్పబడిన రీతిలో ఉపాయాలను చేసే దేవతలు మొదలైనవ జ్ఞానులకు వారు కోరే ప్రయోజనాలను ఇచ్చి పోషిస్తున్నావు. ఇంకా విశేష జ్ఞానాన్ని పొందిన వారు అల్పమైన ఇహలోక ప్రయోజనాలను కోరదు వాటిలో వేగటును పొంది మోక్షానికి ఉపాయమైన ప్రాపర్టీ నే చేస్తాను వారికి ఈనాడు నశించని మోక్షానందాన్ని నీవు ఇస్తున్నావు ఈ మోక్షం ఇవ్వడం నీ వల్లనే సాధ్యం మోక్షాన్ని పొందడానికి జీవులు చేయవలసిన కార్యాలకు కూడా నీవే సహాయాన్ని చేయాలి ఈ బాధ్యత కూడా నీదే అవుతున్నది అయినా నీయి బాధ్యత ఆచార్యుల దగ్గర ఇచ్చి వేశావు వారుని ఆజ్ఞతో చేతనలకు గొప్ప ఉపదేశాలను చేసి వారిని సంస్కరిస్తున్నారు కాలక్రమంలో వారికి మోక్షంలో ఆశ కలిగేటట్లు చేస్తున్నారు దానికి ఉపాయమైన ప్రపత్తిని వారు ఆచరించేటట్లు చేస్తున్నారు ఈ విధంగా నీ బాధ్యతను ఆచార్యులు స్వీకరిస్తున్నారు రక్షించడం కోసం

అవతరించినవాడు శ్రీవేంకటేశ్వరుడు. నీవు అతని కంటే మిక్కిలి శ్రద్ధను, ఆసక్తిని కలిగినదానివై, ఆచార్యుల మూలంగా పలు విధాలలో చేతనులను సంస్కరించి మంచి మార్గంలోకి తీసుకొనిరావడంవల్ల నీ విషయంలో అంతులేని ప్రీతిని శ్రీ వేంకటేశ్వరుడు కలిగి ఉన్నాడు. నీవు చెప్పినదానిని చెప్పినట్లు చేసేవాడై ఉన్నాడు. అంతేకాక, నీవు అందరికీ అన్ని విధాలైన హితాలను చేస్తూ, సర్వమంగళాలకు నిలయమై ఉన్నావు. ఈ విధంగా తమకు సకలక్షేమాలను కలిగించడం వల్ల చేతనులకు అనుభవించదగినదానవై, మధురమై ఉన్నావు. ఇంతటినీ గొప్పతనాలను భావించి, అందరూ భగవంతుని మిగిలిన గుణాల కంటే నిన్నే మిక్కిలిగా కీర్తిస్తున్నారు. సాటిలేని గొప్పతనాన్ని కలిగిన ఓ దయాదేవీ! నా సంసార బంధం ఒక పెద్ద వృక్షంవలె పెరుగుతూనే ఉన్నది. నేను మీ దగ్గర ప్రపత్తిని చేసి, నన్ను రక్షించే బాధ్యతను నీ సమక్షంలో సమర్పించాను. నీ ప్రేమను నాపై ప్రసరింపచేసి, నా సంసార బంధం అనే వృక్షాన్ని వేరుతో పాటుగా పెకలించి, నన్ను నీ ప్రవాహంలో మునిగిపోయేటట్లు చేయాలి.

ఈ శ్లోకంలో, శ్రీనివాసుని కరుణకు ప్రయోగించిన విశేషణాలు అన్నీ ఆచార్యులకు కూడా పొసగుతాయి అని భావించిన పెద్దలు, ఈ క్రింది విధంగా కూడా అర్థాన్ని తెలియజేస్తున్నారు.

అన్ని మంగళాలకు నిలయమై ఉండే శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! నా ఆచార్యులు ఇతరుల కష్టాన్ని సహించలేని మార్గవాన్ని

కలిగినవారు. అల్ప ఫలాలలో ఆశను లేనివారు. చేతనులకు మంచినే చేసేవారు. విజ్ఞులకు మంచి ఉపదేశాన్ని చేసి, సంస్కరించి, వారిని తరింప చేసేవారు. పండితుల గోష్ఠిలో చాలా ప్రశంసను పొందినవారు. మధురమైన స్వభావాన్ని కలవారు. ఇటువంటి ఆచార్యుల వద్ద నేను నా రక్షణ బాధ్యతలను అన్నిటినీ సమర్పించి వేశాను. సంసారబంధాన్ని సమూలంగా పెకలించి వేసే నీ గొప్పదైన ప్రవాహకెరటాన్ని నాపై ప్రవహింపచేయాలి.

*61) అకూపారై రేకోదకసమయవైతండికజవైః*
*అనిర్వాప్యాం క్షిప్రం క్షపయితుమవిద్యాఖ్యబడబామ్ /*
*కృపే త్వం తత్తాదృక్పృథిమవృషపృథ్వీధరపతి-*
*స్వరూపద్వైగుణ్యద్విగుణనిజబిందుః ప్రభవసి ॥*

దయాదేవీ! శ్రీవేంకటాచలం ఎంత పెద్దది? అని ఒకడు అడిగితే ఏమని సమాధానం చెప్పాలి? "అంత పెద్దది" అని మాత్రమే చెప్పవచ్చు. ఈ విధంగా చాలా పెద్దది అయిన తిరుమలకు నాయకుడై వెలుగుతున్నాడు, శ్రీనివాసుడు. అతని ఆత్మ, జీవాత్మవలె అణువైనది కాదు. అతని ఆత్మ అంతటా వ్యాపించి ఉండే విభువు. అది లేని చోటే లేదు. ఈ విధంగా ఉండే అతని ఆత్మను దివ్యాత్మ స్వరూపం అని అంటారు. దానికంటే నాలుగు రెట్లు పెద్దది అయిన ఒక వస్తువు ఉన్నది అని అనుకుంటే, ఆ వస్తువు దయాదేవివి అయిన నీ ఒక్క కణమే. నీ ఒక కణం చేసే అరుదైన కార్యాన్ని ప్రలయకాలంలోని సముద్రాలు కూడా

చేయలేవు. ప్రళయకాలంలో పేరు భూతాలు కనిపించని విధంగా అంతటా ఒకటే జలంగా వ్యాపించి ఉంటుంది. అప్పుడు సముద్రాలు, "రక్షించవలసిన వస్తువులు, నశింప చేయవలసిన వస్తువులు "అనే విభాగం ఏమీ లేకుండా, అన్నిటినీ మింగి, విజృంభించి, గొప్ప శబ్దం చేస్తూ, చాలా వేగంగా ఉంటాయి. కొందరు వితండవాదం చేయడం ఉన్నది. వారు స్థాపించవలసిన సిద్ధాంతాలు, నిరాకరించవలసిన సిద్ధాంతాలు– అనే తేడా భావించకుండా, ఇతరులు చెప్పే అనేవాటిని అన్నిటినీ కాదంటూ, పెద్ద గొడవ చేసి, వేగంతో మాట్లాడతారు. వారి మాటవేగంవంటిదే, ప్రళయకాలంలోని సముద్రాల వేగం. సముద్రంలో ఎక్కువగా వచ్చే నీటి ప్రవాహాన్ని అంతా పానం చేసి, అది అవధిని మీరకుండా చేయడంకోసం సముద్ర మధ్యలో బడబానల మూర్తి (ఆడగుర్రం ముఖం కలిగినది) అనే అగ్ని ఉన్నది. ఈ అగ్నినిమాత్రం ప్రళయకాలంలో సముద్రంలోని నీరు ఆర్పలేదట. ఈ అగ్నివలె ఉన్నది నా కర్మల సమూహం. దీనిని వేగంగా, సమూలంగా నశింపచేయడానికి నీవల్లనే సాధ్యం. ఇందుకోసం నీ ఒక్క కణం చాలు. అది బ్రహ్మాస్త్ర స్వరూపం కంటే నాలుగు రెట్లు పెద్దది కదా, నీ ఒక్క క్షణం. ఈ విధంగా చేసి, నన్ను నీవు రక్షించాలి.

*62) వివిత్సావేతాళీ విగమపరిశుద్ధేఽ పి హృదయే*
*పటుప్రత్యాహారప్రభృతిపుటపాకప్రచకితాః /*
*సమంత స్త్వాం నారాయణశిఖరికూటస్థకరుణే*
*నిరుద్ధత్వద్రోహా నృపతిసుతనీతిం న జహతి ॥*

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! లోకంలో జనులకు పలు విధాలయిన ఆశలు, అంటే, భూమిపై ఆశ, కాంతలపై ఆశ, బంగారం పై ఆశ మొదలైనవి కలుగుతాయి. ఈ ఆశలు, ఆడరూపంలోని పిశాచాలవంటివి, ఆడపిశాచానికి అది అడిగే వస్తువులు అన్నీ ఇవ్వాలి. లేకపోతే చాలా హాని చేస్తుంది. ఆ విధంగానే, ఆశ అనే ఆడపిశాచికి అది అడిగిన వస్తువులను ఇస్తూనే ఉండాలి. లేకపోతే అది చాలా హాని చేస్తుంది. పుణ్యశాలురు అయిన కొందరు పెద్దలు ఈ ఆశలను పూర్తిగా విడచిపెట్టి, తమ మనస్సును పవిత్రంగా చేసుకొంటారు. ఈ విధంగా మనసులో పవిత్రత పొందిన వారుకూడా భక్తియోగం చేసి, మోక్షం పొందాలనే యోగ్యతను పొందడం కఠినంగా ఉంటుంది. భక్తి యోగానికి తగిన అంగాలను ఆచరించడం అంత సులభం ఏమీ కాదు. ఉదాహరణంగా, ప్రత్యాహారం అనే ఒక అంగం ఉన్నది. ఇది ఇంద్రియాలను బయటకు పోనీయకుండా లోపల అణిచి పెట్టడమే. ఇది సులభంగా చేయడానికి సాధ్యమా? ఈ విధంగానే, ఇంకా ఏడు అంగాలు ఉన్నాయి. వీటిని చేయడం చాలా కఠినం. వీటిని చేయడం పుటం పెట్టి నిప్పులో కాల్చడంవంటిది అవుతున్నది. ఈ విధంగా అంగాలను చేయడమే కష్టంగా ఉండగా, ఇక, భక్తియోగాన్ని చేయడం ఏ విధంగా చేయడం సాధ్యం అవుతుంది? దీనికి కొందరు పెద్దలు చాలా భయపడతారు. వారు సులభంగా ఉండే ఉపాయమైన ప్రపత్తిని ఈ విషయంలో ఆచరిస్తున్నారు. ప్రపత్తిని చేసిన తరువాత, బుద్ధిపూర్వకంగా తప్పులను చేస్తే, నీకు ద్రోహం చేసినట్లే కదా అవుతుంది. అందుచేత, శాస్త్రం నిషేధించిన కార్యాలను

వారు తెలిసి చేయడం లేదు. కాలదోషంచేత తప్పు చేయడం తటస్థించినా, చిన్న దండనను అనుభవించి పవిత్రతను పొందుతున్నారు. పట్టాభిషేకం చేసుకోవాలని ఉండే రాజకుమారునివలే వారు ప్రకాశిస్తున్నారు. రాజకుమారుడు తప్పు చేస్తే, అతనికి దండనలు ఉంటాయి. అయితే, అతనికి యోగ్యకు తగినట్లు కొన్ని దండనలే, చిన్నదండనలే విధింపబడతాయి. ఆ విధంగానే, నిన్ను శరణు పొందినవారి విషయంలో కూడా వారు చేసిన తప్పులకు చిన్నదండలను ఇచ్చి, వారిని పవిత్రులుగా చేసి, మోక్షానందాన్ని అనుగ్రహిస్తున్నావు.

***63) అనన్యాధీనః సస్ భవతి పరతంత్రః ప్రణమతాం***
***కృపే సర్వద్రష్టా న గణయతి తేషా మపకృతిమ్ /***
***పతి స్వ త్వారార్థ్యం ప్రథయతి వృషక్ష్మా ధరపతిః***
***వ్యవస్థాం వైయాత్యాదితి విఘటయంతీ విహరసి //***

దయాదేవీ! నీవు, నీ నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుని నీ ఇష్టానుసారంగా ఆడిస్తున్నావు. అతడు ఇతరులకు లోబడకుండా స్వతంత్రుడై ఉండేవాడు. ఆ విధంగా ఉండేవాడినికూడా, శరణు పొందినవారికి తోబడేటట్లు ఉండి, భక్తుల రథాన్ని నడపడం, వారికి దూతగా వెళ్లడం మొదలైన నీచకార్యాలను చేసేటట్లు అతనిని ప్రేరేపిస్తున్నావు. అంతేనా! అతడు సకల వస్తువులను ఒకే కాలంలో ప్రత్యక్షంగా చూడగలిగినవాడు. అటువంటి అతడు దాసుల దోషాలను చూడనివాడినిగా చేసి, భక్తుల దోషాలను విడిచి పెట్టేటట్లుగా చేస్తున్నావు.

అతడు నీ ఆజ్ఞకు లోబడికదా ఉంటాడు. అతడు నీకు నాయకుడై ఉన్నా, తనను నీకు వశమైనవాడుగా ఉండే విషయాన్ని లోకానికి వ్యక్తం చేస్తున్నావు. శాస్త్రాలలో భగవంతుని గూర్చి చెప్పిన గొప్పతనాలను అన్నిటినీ ఈ విధంగా నీవు కూలదోసి, అతనికి సహజంగా ఉండే స్వభావాలను మార్చి చేస్తున్నావు. వీటికి అన్నిటికి నీ ధైర్యమే కదా, కారణం!

*64) అపాం పత్యుః శత్రూ నసహనమునే ర్ధర్మ నిగళం*
*కృపే కాకస్యైకం హితమితి హీనస్తి స్మ నయనమ్ /*
*విలీన స్వాతంత్ర్యో వృషగిరిపతి స్త్వద్వ్యహ్వతిభిః*
*దిశత్యేవం దేవో జనితసుగతిం దండనగతిం //*

దయాదేవీ! నీ లీలలు చాలా విచిత్రమైనవి. నీ లీలలచేత శ్రీవేంకటేశ్వరుడు తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి, నీకు వశమై ఉన్నాడు. జీవులు తెలిసి చేసే దోషాలకు తగిన విధంగా అతడు ఇచ్చి దండనలు అన్నీ దోషులకు మంచిగానే పర్యవసిస్తున్నాయి. దీనికి అంతటికి నీవే కారణం. సముద్రంలో వారధిని కట్టడం కోసం సముద్రుని పిలచిన శ్రీరాముడు, అతడు రానందువల్ల చాలా కోపంతో అతనిపై బాణాలను వేయడానికి సిద్ధపడ్డాడు. వెంటనే సముద్రుడు వచ్చి ఆశ్రయించాడు. అప్పుడు ఆ బాణాలను తన శత్రువులపై ప్రయోగించమని అతడు చెప్పాడు. సముద్రరాజుకు ఇవ్వదలచిన దండన అతని శత్రువులను నిశింపజేయడం కోసం కారణమైనందున అతనికి హితంగా

పర్యవసించింది. శ్రీరాముడు సీతాదేవిని వివాహం చేసికొని మిథిలానగరం నుండి తిరిగి వచ్చేటప్పుడు, అతని మహిమను సహించలేని పరశురాముడు ఎదిరించాడు. లతా నేను దండించడం కోసం శ్రీరాముడు ప్రయోగించిన బాణం, అతడు స్వర్గం మొదలైన ఉత్తమ లోకాలను పొందడానికి అడ్డుగా ఉండే పుణ్యం మొదలైనవి నశించడానికి సహాయపడింది. సీతాదేవి విషయంలో చాలా అపరాధం చేసిన కాకాసురునిపై ప్రయోగించిన బాణం, తనను శరణు పొందిన అతని ఒక కంటిని మాత్రం పోగొట్టి, ప్రాణాలను కాపాడింది. ఈ విధంగా భగవంతుడు చేసిన దండనలు అన్నీ హితంగానే పర్యవసించేటట్లు ఉన్నాయి కదా. కరుణ లేక పోతే ఈ దండనలు మంచికి ఏ విధంగా కారణం అయ్యేటట్లు అవుతాయి?

***65) నిషాదానాం నేతా కపికులపతిః కాఽ పీ శబరీ***
***కుచేలః కుబ్జా సా వ్రజయువతయో మాల్యకృదితి /***
***అమీషాం నిమ్నత్వం వృషగిరిపతే రున్నతిమపి***
***ప్రభూతైః స్రోతోభిః ప్రసభ మనుకంపే సమయసి //***

దయాదేవీ! ఎత్తు పల్లాలు అయిన చోటులో ఒక పెద్ద ప్రవాహం ప్రవహించి వస్తే, అది ఎత్తుగా ఉండే చోటును పల్లంగాను, పల్లంగా ఉండే చోటును ఎత్తుగాను చేసి భూమిని సమం జేస్తుంది. ఆ విధంగానే, నీ ప్రభావంతో పర్వతంపై ఉండే శ్రీ వేంకటేశ్వరుని బలంగా పట్టుకొని, చాలా తక్కువ వారితో సమంగా కలసి వర్తించేటట్లుగా చేస్తున్నావు. ఇతరులకు

దుఃఖం కలిగించడమే స్వభావంగా కలిగిన వ్యాధుల కులానికి నాయకుడైన గుహునితో సర్వేశ్వరుడైన శ్రీనివాసుడు శ్రీరామావతారంలో స్నేహాన్ని కలిగి ఉండేటట్లు చేశావు. వానర జాతికి ప్రభువైన సుగ్రీవునకు తనకు సఖునిగా చేసుకునేటట్లు చేశావు. వ్యాధుల కులంలో పుట్టి అరణ్యంలో తిరిగే శబరి ఇచ్చిన తీయని పండ్లను స్వీకరించి, ఆమెకు సద్గతిని ఇచ్చి, అనుగ్రహించే విధంగా చేశావు. ధరించడానికి కూడా తగిన వస్త్రాలు లేకుండా చినిగిన వస్త్రాలనే కట్టుకుని, కుచేలుడు అని పేరు కలిగిన బ్రాహ్మణునితో శ్రీకృష్ణావతారంలో విచిత్రమైన రీతిలో కూడి కలసేటట్లు చేశావు. చూసినావారికి రోత కలిగించే విధంగా ఉండే ఒక గూనికి చాలా అందమైన లేత వయసులో ఉండే రూపాన్ని ఇచ్చేటట్లు చేశావు. జ్ఞాన వాసన ఏమాత్రం లేనటువంటి గొల్లకులంలోని గోపికలకతో సంతోషంతో వారితో కలిసేటట్లు వర్తించేటట్లు చేశావు. పూలమాలలను కట్టి జీవించే మాలాకారుని ఇంటికి వెళ్లి, అతనికి పరిపూర్ణమైన అనుగ్రహం చేసేటట్లు చేశావు. ఈ విధంగా సర్వేశ్వరుడైన పురుషోత్తముడైన శ్రీవేంకటేశ్వరుని నీవు నీ మహాప్రవాహాలతో బలంగా గట్టిగా పట్టుకొని, అతడు తక్కువ వారితో సమంగా కూడికలసి వర్తించి ఆనందించేటట్టు చేసినది నీవే కదా. కరుణ లేకపోతే భగవంతుడు ఈ విధంగా తక్కువవారితో సమానంగా కలవడం ఏ సమయంలోనూ వీలు కాదు. చాలా పెద్దవాడు చాలా చిన్నవారితో ఎటువంటి తేడా లేకుండా కలసి వర్తించడం అనే సౌశీల్య గుణం భగవంతునకు దయాదేవి అయిన నీ వల్లనే స్థిరంగా నిలచి ఉన్నది.

*66) త్వయా దృష్ట స్తుష్టిం భజతి పరమేష్ఠీ నిజపదే*
*వహన్ మూర్తీరష్టా విహరతి మృడానీపరిబృఢః |*
*బిభర్తి స్వారాజ్యం వృషశిఖరిశృంగారికరుణే*
*శునాసీరో దేవాసురసమరనాసీరసుభటః ॥*

శ్రీవేంకటాద్రిపై ఉల్లాస పురుషుడై వెలిగే శ్రీనివాసుని దయాదేవీ! అందరూ దేవుళ్ళలో గొప్పవాడైన బ్రహ్మదేవుడు చాలా గొప్పదైన తన స్థానంలో ఉంటూ, గొప్ప ఆనందాన్ని పొందుతున్నాడు. దానికి ఏమి కారణం? నీవు కటాక్షించకపోతే అతనికి ఈ స్థానం ఏ విధంగా లభిస్తుంది? మహేశ్వరుడు అనే పేరు పొందిన శివుడు భూమి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం, చంద్రుడు, సూర్యుడు, యజమాని అనే ఎనిమిదింటికి అధిపతియై, తన భార్య అయిన పార్వతితో ఉల్లాసంగా కాలం గడుపుతున్నాడు. ఎందువల్ల? నీ కటాక్షం అతనిపై పడినందువల్లనే కదా! దేవేంద్రుడు దేవాసుర యుద్ధంలో సయుద్ధరంగంలో సాటిలేని వీరుడై నిలచి, జయాన్ని పొంది, స్వర్గ సామ్రాజ్యాన్ని ఏకభోగంగా పరిపాలించడం ఎందువల్ల? నీ కటాక్షం పొందినందువల్లనే కదా! ఈ విధంగా చాలా గొప్పతనాన్ని పొందిన దేవతలు అందరూ తమ తమ స్థానాలను పొందడం, ఆ స్థానాలలో ఎటువంటి ఉపద్రవం లేకుండా ఉండి, ఆనందం అనుభవించడం, తమ తమ అధికారాన్ని సరిగా నిర్వహిస్తూ పోవడం అంతా కూడా దయాదేవి అయిన నీ కటాక్షం చేతనే సాధ్యం అవుతున్నది.

*67) దయే దుర్ధోదన్వద్వ్యతియుతసుధాసింధునయతః*
*త్వదాశ్లేషాన్నిత్యం జనితమృతసంజీవనదశాః /*
*స్వదంతే దాంతేభ్యః శ్రుతివదనకర్పూరగుళికాః*
*విషుణ్వంత శ్చిత్తం వృషశిఖరివిశ్వంభరగుణాః ॥*

దయాదేవీ! పాలసముద్రం చాలా మధురమైనది. అమృతమయంగా ఒక ప్రవాహం ఉన్నట్లయితే, అది పాలసముద్రం కంటే చాలా మధురంగా ఉంటుంది. అమృతానికి చనిపోయేవారిని బతికించే సామర్థ్యం ఉన్నది. పాలసముద్రంతో అమృత ప్రవాహం చేరినట్లయితే, దాని గొప్పతనం ఇక చెప్పాలా? శ్రీవేంకటేశ్వరుడు తిరుమలలో ఉన్నతమైన చోట నిలచి లోకాన్ని అంతటినీ రక్షిస్తున్నాడు. అతని మిగిలిన గుణాలు అనుభవించటానికి యోగ్యంగా ఉంటాయి. వాటి కంటే భోగ్యంగా ఉండేదానివి నీవు, ఆ గుణాలతో నీవు కలసి ఉండడం పాలసముద్రంలో అమృత ప్రవాహం కూడినట్లుగా ఉన్నది. నీవు కలసినందున ఆ గుణాలకు గొప్పతనం అతిశయిస్తున్నది. తత్వజ్ఞాన లేకుండా ఉండేవిధంగా ఉండే చేతనులను నీవు తరింప చేస్తున్నావు. శ్రీనివాసుని దయ అయిన నీ చేతనేకదా చేతనులు తత్వజ్ఞానాన్ని పొంది, చివరిలో మంచి గతిని పొందుతున్నారు. నీకు సంబంధించిన గుణాలు కూడా చేతనులను మంచిగతిని పొందించే శక్తిని పొందుతున్నాయి. ఇంత మాత్రమేనా? పచ్చకర్పూర కణాలను నోటిలో వేసుకుంటే, సువాసన, రుచి ఏర్పడుతుంది కదా! వేదంలోని మిగిలిన గుణాలు పచ్చకర్పూర గుళికలువలె ఉన్నాయి. అంటే, వేదంలోని ముఖమైన ఉపనిషత్తు అ

గుణాలనే పొగడి ఆనందిస్తున్నది. ఈ గొప్పతనం కూడా ఆ గుణాలకు నీవు కలసి ఉన్నందువల్లనే వస్తున్నది. అంతేకాక, ఆ గుణాలు తమను అనుభవించేవారి మనసును ఆకర్షించి భావించి ద్రవించేటట్లు చేస్తున్నాయి. ఇంద్రియాలను బాహ్యాప్రపంచంలో అన్యవిషయాలను అనుభవించేటట్లు విడువకుండా అణచి, పెద్దలు ఆ గుణాలను ఎప్పుడు అనుభవించి, ఆనందాన్ని పొందుతున్నారు. నీవు కలసినందువల్లనే కదా, వాటికి గొప్పతనాలు వచ్చాయి. నీవు లేకపోతే భగవంతుని మిగిలిన గుణాలచేత చేతనులకు వచ్చే ప్రయోజనం ఏమి ఉన్నది? నీ గొప్పతనమే అంతటికి కారణం అవుతున్నది.

***68) జగజ్జన్మ స్థేమప్రళయరచనాకేళిరసికః***
***విముక్త్యేకద్వారం విఘటితకవాటం ప్రణయినామ్ ।***
***ఇతి త్వయ్యాయత్తం ద్వితయ ముపధీకృత్య కరుణే***
***విశుద్ధానాం వాచాం వృషశిఖరినాథః స్తుతిపదమ్ ॥***

దయాదేవీ! నీ నాయకుడైన శ్రీవేంకటేశ్వరునకు ఉన్నతమైన రెండు అంశాలు ఉన్నాయి. ఒకటి –లోకానికి కారణమై ఉండడం, ఇంకొకటి– మోక్షాన్ని ఇవ్వడం. శ్రీనివాసుడు లోకాన్ని సృష్టించి, రక్షించి, లయం చేస్తున్నాడు. ఈ కార్యాలు అతనికి లీలగా ఉన్నాయి. వీటిని అతడు ఆనందంగా చేస్తున్నాడు. ఈ కార్యాలు కరుణ అయిన నీ వల్లనే నడుస్తున్నాయి. కనుక, వీటికి నీవే కారణం అవుతున్నావు. అంతేకాక, భగవంతుడు తన దగ్గర భక్తిని కలిగి, ప్రపత్తిని చేసినవారికి

మోక్షకవాటాలను తెరిచి పెట్టి, తానే లోపలకు ప్రవేశించే ఒకే ద్వారంగా నిలచి ఉండి, చేతనలను "రా! " అని ఆహ్వానిస్తున్నాడు. అతడు ఈ విధంగా చేయడం కూడా నీ కారణంచేతనే. ఎటువంటి దోషం లేకుండా, ఎప్పుడు పవిత్రంగా వెలిగే వేదవాక్కులు శ్రీవేంకటేశ్వరుని స్తుతిస్తున్నాయే! "అతడు లోకానికి కారణమై ఉండేవాడు, మోక్షాన్ని ఇచ్చేవాడు"– అని ఈ గొప్పతనాలను ముఖ్యంగా గ్రహించి కదా అవి కీర్తిస్తున్నాయి. ఈ రెండు అంశాలు అతనికి నీ వల్లనే కదా వచ్చాయి.

***69) కలిక్షోభోన్మీలలత్ క్షితికలుషకూలంకషజవైః***
***అనుచ్ఛేదై రేతై రవటతటవైషమ్యరహితైః /***
***ప్రవాహై స్తే పద్మాసహచరపరిష్కారిణి కృపే***
***వికల్ప్యంతేఽనల్పా వృషశిఖరిణో నిర్ఝరగణాః ॥***

దయాదేవీ! లక్ష్మీదేవిని క్షణం కూడా విడువకుండా తన హృదయంలో శ్రీనివాసుడు ధరిస్తాడు. అయినా, అతనికి గొప్పతనం నీ వల్లనే వస్తున్నది. నీ ప్రవాహంతో, తిరుమలలో ప్రవహించే నీటి ప్రవాహాల సమూహాలను పోల్చి పెద్దలు పలుకుతారు. తిరుమలలో ఉండే కొండవాగులు అక్కడ ఉండే వస్తువులను అన్నిటినీ కొట్టుకుంటూ, రెండు తీరాలను కూల్చుకుంటూ, మిక్కిలి వేగంతో ప్రవహిస్తున్నాయి. స్నానం చేసేవారి పాపాలను పోగొడుతున్నాయి. గ్రీష్మ కాలంలో కూడా నిరంతరంగా ప్రవహిస్తున్నాయి. ఎత్తు, పల్లం అనే తేడా లేకుండా అంతటా ప్రవహిస్తున్నాయి. చాలా గొప్ప వేగంతో అవి ప్రవహిస్తున్నాయి.

దయాదేవివి అయిన నీ ప్రవాహాలు కూడా ఆ విధంగానే కలిదోషం చేతనుల దగ్గర ఇంకా ఇంకా వృద్ధి చెందుతున్న పుణ్యం, పాపం అనే రెండు విధాలయిన కర్మలను వేగంగా పోగొట్టగలిగినవి. అందరి విషయంలోను ఎల్లప్పుడూ నిరంతరంగా ప్రవహిస్తున్నవి. ఉన్నతమైనవారు నీచులు అనే తేడా చూడకుండా, జీవులందరి విషయంలోనూ సమానంగా ప్రసదించే స్వభావాన్ని కలిగినవి. చాలా పెద్దవి. ఇటువంటి స్వభావాల చేత నీ ప్రవాహాలను ఉపమానంగా పెట్టుకొని, దానికి తగిన వాటితో పోలినవి, తిరుమలలో ఉండే కొండవాగులు– అని విజ్ఞులు అంటున్నారు. ఈ ప్రవాహాలు పర్వతంలో ఉండే కొంఢవాగుల వంటివి– అనే ఉపమానప్రకారంలో ఉపమాలంకారాన్ని చెప్పకుండా, పర్వతంలో ఉండే నీ ప్రవాహాలవంటివి, తిరుమలలో ఉండే కొండవాగులు– అని విజ్ఞులు చెప్పినందువల్ల, వాస్తవంలో తిరుమలలో ఉండే కొండవాగుల కంటే నీ ప్రవాహాలకు ఉండే గొప్పతనం చాలా బాగా వ్యక్తం అవుతున్నది.

*70) ఖిలం చేతోవృత్తేః కిమిద మితి విస్మ రభువనం*
*కృపే సింహక్ష్మా భృత్కృతముఖచమత్కా రకరణం ।*
*భరన్యాసచ్ఛ న్న ప్రబలవృజిన ప్రాభృతభృతాం*
*ప్రతిప్రస్థానం తే శ్రుతినగరశృంగాటకజుషః ॥*

దయాదేవీ! వేదం అనేది ఒక పెద్ద నగరం. నగరంలో అన్ని వస్తువులు లభించినట్లే, వేదంలోకూడా ఐశ్వర్యం, కైవల్యం, మోక్షం అనే

అన్ని ఫలాలను పొందే దారులు చూపబడుతున్నాయి. ఆయా ప్రయోజనాలను కోరేవారు వానికి తగిన ఉపాయాలను చేసి, తమ కోరికకు తగినట్టుగా ప్రయోజనాలను పొందుతారు. నగరంలో అనేక విధాలైన శాలలు ఉంటాయి. అయినా, నాలుగు పక్కల దారులు కలిసే చోటు అయిన కూడళ్ళు చాలా ముఖ్యం. ఆ విధంగానే, వేదం అనే నగరానికి ఉపనిషత్తు అనే భాగమే కూడలిగా నిలచి ముఖ్యంగా ప్రకాశిస్తున్నది. ఆ ఉపనిషత్తుచేత కీర్తింపబడిన నీవు గొప్పగా వెలుగుతున్నావు. పాపులు తమ తమను రక్షించుకోవడం కోసం నీ దగ్గరకు వస్తున్నారు. ఏ విధంగా వస్తున్నారు. వారు అనాదికాలంగా లెక్కలేనన్ని పాపాలను చేశారు. వాటిని పోగొట్టుకోవడం కోసం నీ దగ్గరకు శరణాగతి చేయాలని వారు ముందుకు వస్తున్నారు. తమ క్రూరమైన పాపాలను పోగొట్టుకొని తమను రక్షించే బాధ్యతను నీ సమక్షంలో సమర్పించివేయాలని నిశ్చయించుకుంటున్నారు. దానికి తగినట్లుగా తమ దగ్గర ఏ విధమైన యోగ్యత లేకపోవడాన్ని గ్రహిస్తున్నారు. భరన్యాసం అనే తుండుతో తమ పాపాలను చక్కగా కప్పుకొని, వాటిని నీకు నైవేద్యం చేసే వస్తువును వలె మూట కట్టి పట్టుకొని, నీ దగ్గరకు వస్తున్నారు. వారు ఈ విధంగా తమను నిన్ను శరణు పొందాలని నిన్ను ఉద్దేశించి ప్రయాణానికి అడుగు పెట్టినప్పుడే, నీవు వారిని ప్రీతితో స్వాగతించి, వారికి ఆహ్వానాన్ని పలుకుతున్నావు. క్రూరమైన పాపాలను చేసిన పాపుల విషయంలో కూడా వారు చేసే నిశ్చయం, చాలా గొప్ప ఉపాయం అయిన భరన్యాసంచేత వ్యామోహాన్ని పొందుతున్నావు. నీ

గొప్పతనాన్ని లెక్కచేయకుండా, భావించకుండా, వారిని ఆదరించి, వారికి ఎదురుగా వేగంగా వస్తున్నావు. పండితులు పామరులు నిండిన లోకం అంతా నీ కార్యాన్ని చూసి, " నీ మనోభావంలో ఏదైనా దోషం ఉన్నదా? ఏమి ఇది?" అని చాలా ఆశ్చర్యాన్ని పొందుతున్నారు. ఇంత మాత్రమేనా! తిరుమలలో నిలచి అందరినీ, ప్రత్యక్షంగా చూడగలిగినని నాయకుడైన శ్రీనివాసుడు నీవు చేసే ఈ కార్యాన్ని చూసి, ఆశ్చర్య రసంలో మునిగిపోతున్నాడు. లోకంలో ప్రభువులు మొదలైనవారి కోసం జనులు ఎవరి కంటికి కనిపించకుండా మూసుకొని తీసుకుని వచ్చే పళ్ళు మొదలైనవాటినే ఆ ప్రభువునలు గ్రహించి భుజిస్తారు. అర్చారూపాన్ని గ్రహించిన భగవంతునకు కూడా చిత్రాన్నం మొదలైనవాటిని వస్త్రంతో కప్పుకొని, తీసుకొని సమర్పిస్తేనే, అతని మనసుకు ఇష్టం అవుతుంది. ఆ విధంగానే, జనులు తమ పాపాలను నైవేద్య వస్తువులుగా భరన్యాసం అనే వస్త్రంతో ఆవరించి సమర్పిస్తేనే, నీవు ఆ పాపాలను భుజిస్తున్నావు. అంటే, ప్రపత్తిని చేయనివారి విషయంలో వారి పాపాలు తొలగిపోవు.

*71) త్రివిధచిదచిత్సత్తాస్థేమప్రవృత్తినియామికా*
*వృషగిరివిభో రిచ్ఛా సా త్వం పరై రపరాహతా /*
*కృపణభరభృత్ కింకుర్వాణప్రభూతగుణాంతరా*
*వహసి కరుణే వైచక్షణ్యం మదీక్షణసాహసే //*

దయాదేవీ! జీవులు మూడు విధాలుగా ఉంటారు. బద్ధులు అనేవారు సంసారంలో బంధింపబడినవారు. ముక్తులు మోక్షాన్ని

పొందినవారు. నిత్యులు నిత్యసూరులు. అచేతనం కూడా మూడు విధాలుగా ఉంటుంది. ప్రకృతి, కాలం, శుద్ధసత్వం అని అది మూడు విధాలు. ఈ విధంగా ఉండే చేతనాచేతనాల స్వరూపం, అంటే, అవి చిరకాలం నిలచి ఉండడం, వాటి ప్రవృత్తి అనే అన్నిటిని కూడా నీవే నిర్వహిస్తున్నావు. నీ పోకడను అడ్డు పెట్టడానికి ఎవరికీ సాధ్యం కాదు. భక్తియోగం అనే కఠినమైన ఉపాయాన్ని చేయలేక క్లేశపడేవారు ప్రపత్తిని చేస్తారు. వారిని రక్షించే బాధ్యత పూర్తిగా నీదే అని భావిస్తున్నావు. భగవంతుని మిగిలిన అన్ని గుణాలు అన్ని నిన్ను మహారాణిగా భావించి, నీకు కైంకర్యం చేస్తున్నాయి. శ్రీవేంకటేశ్వరుని ఆశయే నీవు. దయ అనేది తన ప్రయోజనాన్ని ఏమి భావించకుండా, ఇతరుల దుఃఖాన్ని తీర్చాలని కోరడమే కదా. అటువంటి గొప్పతనంతో అందరికంటే, అన్నిటికంటే అతిశయించి ఉండే నీవు చాలా ఒక నిశ్చితమైన కార్యాన్ని చేస్తున్నావు. నా సంబంధం నీకు ఏర్పడితే, నీకు గొప్పతనం తగ్గుతుందేమో! అని భయపడేటట్లుగా ఎంతటి క్రూరమైన పాపాలను నేను చేశాను! ఇటువంటి నన్ను కూడా నేను చేసే ప్రపత్తి అనే చాలా అల్పమైన ఉపాయాన్ని పురస్కరించుకొని, నన్ను చల్లగా కటాక్షిస్తున్నావు. ఈ కార్యాన్ని చేయడానికి నీకు తప్ప వేరు ఎవరికి ఆశ, నిశ్చయం అనేవి ఉంటాయి? ఇది నీకే కల, తగిన, ఒక విలక్షణమైన స్వభావాన్ని తెలియజేస్తున్నది.

*72) వృషగిరిపతేర్హృద్యా విశ్వావతారసహాయినీ*

*క్షపితనిఖిలావద్యా దేవి క్షమాదినిషేవితా* /

*భువనజననీ పుంసాం భోగాపవర్గవిధాయినీ*

*వితమసి పదే వ్యక్తిం నిత్యాం బిభర్షి దయే స్వయమ్ ॥*

దయాదేవీ! నీకు, లక్ష్మీదేవికి చాలా దగ్గర సామ్యం ఉన్నది. శ్రీవేంకటేశ్వరుని హృదయంలో లక్ష్మీదేవి నివసిస్తున్నది. నీవు కూడా, ఆ స్వామి మనస్సులో నిలచి ఉన్నావు. లక్ష్మీదేవి భగవంతుడు పరిగ్రహించే అన్ని అవతారాలలోనూ తాను కూడా అతని వెంట అవతరించి సహాయం చేస్తున్నది. నీవు కూడా ఆ విధంగానే ఆ స్వామి ఎత్తే అన్ని అవతారాలలోనూ ఆ స్వామిని విడవకుండా నిలచి, అతడి కార్యాలకు సహాయపడుతున్నావు. కరుణ లేకపోతే భగవంతుని అవతారం ఎక్కడ ఉన్నది? లక్ష్మీదేవి చేతనుల పాపాలను లేకుండా చేస్తున్నది. నీవు ఉండే చోట చేతనుల పాపాలు నిలువ లేవు, పరిగెత్తుకొని పోతాయి. లక్ష్మీదేవిని క్షమాదేవి మొదలైన మిగిలిన దివ్యపత్నులు నమస్కరించి సేవ చేస్తారు. నీకు క్షమ మొదలైన మిగిలిన గుణాలు లోబడి ఉండి, ఈ ఆజ్ఞను నిర్వహిస్తాయి. లక్ష్మీదేవి లోకానికి తల్లియై ప్రకాశిస్తున్నది. నీవు కూడా లోకసృష్టికి కారణమై ఉన్నందున తల్లివై ఉన్నావు. లక్ష్మీదేవి చేతనులకు ఇహలోక ప్రయోజనాలను, మోక్షాన్ని ఇస్తున్నది. ఆ విధంగానే, నీ సహాయాంతోనే చేతనులు ఆ ప్రయోజనాలను పొందడానికి సాధ్యం అవుతున్నది. లక్ష్మీదేవి తమోగుణమే లేని శ్రీ వైకుంఠంలో నిత్యంగా ఉండే తిరుమేనితో ఎల్లప్పుడూ ఉంటుంది. నీవు కూడా తమోగుణం లేని, సత్త్వగుణమే తల ఎత్తిన సాధువుల వద్ద నీవుగానే వెళ్లి, శాశ్వతంగా నిలచి ఉంటావు. ఈ విధంగా నీకు లక్ష్మీదేవికి మధ్య ఉండే సామ్యాలను

చూసినప్పుడు, "మీరు ఇద్దరూ ఒకే రూపమా! " అని భావించటానికి సాధ్యం అవుతున్నది.

*73) స్వయ ముదయినః సిద్ధాద్యావిష్కృతా శ్చ శుభాలయాః*
*వివిధవిభవవ్యూహావాసాః పరం చ పదం విభోః /*
*వృషగిరిముఖేష్వేతేష్విచ్ఛావధిప్రతిలబ్ధయే*
*దృఢవినిహితా నిశ్రేణి స్త్వం దయే నిజపర్వభిః ॥*

దయాదేవీ! 1) భగవంతుడు అయిదు విధాలైన రూపాలతో ప్రకాశిస్తున్నాడు. అతడు అనేక దివ్యదేశాలలో అర్చారూపాన్ని పరిగ్రహించి అవతరిస్తున్నాడు. వాటిలో, కొన్ని క్షేత్రాలలో, ఎవరి ప్రార్థనను ఆధారంగా చేసుకోకుండా, స్వయంగానే వచ్చి అవతరిస్తున్నాడు. ఈ క్షేత్రాలు స్వయం వ్యక్తాలు అని చెప్పబడుతున్నాయి. శ్రీ వేంకటాచలం స్వయం వ్యక్త క్షేత్రాలలో చాలా ముఖ్యమైనది. సిద్ధులు, దేవతలు, మునులు మొదలైనవారి తపస్సు చేత, ప్రార్ధనల చేత పలు క్షేత్రాలలో అర్చారూపాన్ని భగవంతుడు పరిగ్రహిస్తున్నాడు. ఈ క్షేత్రాలు సైద్ధాలు, దైవాలు, ఆర్షాలు మొదలైన పేర్లతో వ్యవహరింపబడతాయి. ఇవి అన్ని అర్చావతారాలు.

2) మత్స్యంగా, కూర్మంగా, వరాహంగా, శ్రీరాముడుగా, శ్రీకృష్ణుడుగా, ఈ విధంగా అనేక విధాలైన అవతారాలను ఈ భూమిలో భగవంతుడు స్వీకరిస్తున్నాడు. ఇవి అన్ని విభవానతారాలు అనబడతాయి.

3) వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే పేర్లను కలిగి కొన్ని రూపాలను పరిగ్రహించి స్వామి వెలుగుతున్నాడు. ఇవి వ్యూహాలు అనబడతాయి.

4) అందరి హృదయాలలోనూ వాటికి తగినట్లుగా రూపాన్ని పరిగ్రహించి నిలుస్తున్నాడు. ఇది అంతర్యామి అని అనబడుతుంది.

5) శ్రీవైకుంఠంలో పరవాసుదేవుడుగా సాక్షాత్కరిస్తున్నాడు. ఇదే పర రూపం అనబడుతుంది. ఇదే మిగిలిన నాలుగు రూపాలకు మూలం అవుతున్నది.

ఈ విధంగా శ్రీవేంకటాచలం మొదలైన అర్చిరూపం మొదలుగా పరరూపం వరకు ఉండే రూపాలను చేతనులు వారి వారి ఇష్టానికి తగినట్లుగా సేవించి, తాము కోరిన ప్రయోజనాలను పొందుతున్నారు.

లోకంలో ఉన్నతమైన వృక్షాన్ని ఎక్కి, ఫలాలను కోయడానికి పలు మెట్లు ఎక్కాలి. దీనికి నిచ్చెన సాధనం అవుతున్నది. ఐదు రూపాలను కలిగిన భగవంతుడు ఒక కల్పక వృక్షంవంటివాడు. తమ తమ ఇష్టాలకు తగినట్లుగా ఈ రూపాలను సేవించాలని కోరేవారికి భగవంతుడు అనే కల్పవృక్షాన్ని ఎక్కడానికి ఒక నిచ్చెన కావాలి. శ్రీనివాసుని కరుణ అనే నీవు దానికి తగిన నిచ్చెన అవుతున్నావు. వారు వారు తమ ఇష్టానికి తగినట్లు సేవించడానికి వీలైన రీతిలో నీవు మధ్యలో చేసే అనుకూల కార్యాలే ఆ నిచ్చెనలోని మెట్లు అవుతున్నాయి. ఈ విధంగా ఈ మెట్ల ఆధారంగా నీవ్వు గట్టిగా పట్టుకొనపడుతున్నావు. నీవల్ల చేతనులు భగవంతుడు అనే కల్పవృక్షాన్ని ఎక్కి, తాము కోరిన

ప్రయోజనాలు అనే పండ్లను పొందగలుగుతున్నారు. నీవు లేకపోతే జీవులు భగవంతుని దగ్గరకు చేరడానికి, తాము కోరిన ప్రయోజనాలను పొందడానికి సాధ్యం కాదు కదా.

వేరొక చాలా రస్యమైన అంశం కూడా ఉన్నది. నిచ్చెన అనేది ఉన్నతమైన చోటుకు ఎక్కడానికి ఉపయోగపడినట్లే, ఎత్తునుండి కిందకి దిగడానికి కూడా ఉపయోగపడుతుంది. పరవాసుదేవుడై ఉండే పరమపురుషుడు కిందకు దిగి, మిగిలిన రూపాలను పరిగ్రహిస్తున్నాడు కదా. ఏ విధంగా పరిగ్రహిస్తున్నాడు? నీ ద్వారానే అతడు కిందకు దిగి అవతరిస్తున్నాడు. అందుచేత, అతడు క్రిందకు దిగడానికి నీవే సాధనం అవుతున్నావు. నీ దయలేక పోతే ఏ విధంగా అతడు మిగిలిన రూపాలను పరిగ్రహించి జీవులకు సులభమై ఉండగలడు? అందుచేత నీవే రెండు విధాలైన అంశాలకు సాధనమై ఉన్నావు.

*74) హితమితి జగద్దృష్ట్యా క్లుప్తైరక్లుప్తఫలాంతరైః*
*అమతివిహితై రన్యై ర్ధర్మాయితైశ్చ యదృచ్ఛయా /*
*పరిణతబహుచ్ఛద్మా పద్మాసహాయదయే స్వయం*
*ప్రదిశసి నిజాభిప్రేతం నః ప్రశామ్యదపత్రపా ॥*

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! జీవులకు ఏర్పడే పుణ్యాలు అనేక విధాలుగా ఉంటాయి. లోకంలో దేవాలయాలను కట్టడం, చెరువులను తవ్వించడం, దానం చేయడం మొదలైనవానిని పుణ్యకార్యాలుగా జనులు చెబుతున్నారు. కొందరు చేతనులు సాధారణంగా వీటిని అన్నిటిని మంచి

పనులు అనే ఇతరుల అభిప్రాయాన్ని ఆధారంగా చేసికుని, తమకు తెలియకుండా, కొన్ని సత్కార్యాలను చేస్తున్నారు. వీటి వల్ల ఏర్పడే పుణ్యం ప్రాసంగికం అని అనబడుతుంది. ఒకడు ఒక భాగవతునకు కలిగిన శ్రమ తీరడం కోసం విసన కర్రతో విసురుతున్నాడు. ఆ భాగవతుని దగ్గరకు ఇంకొక భాగవతుడు వచ్చి కూర్చున్నాడు. ఇతడు విసిరే విసనకర్ర వల్ల వచ్చిన గాలి ఆ రెండవ భాగవతునకు కూడా తగులుతున్నది, అయితే, ఈ విసిరేవాని దృష్టి అనేది రెండవవానికి విసరాలని లేకపోవచ్చు. అయినప్పటికీ, విసనకర్రను వీచేవానికి పుణ్యం ఏర్పడుతున్నది. ఈ పుణ్యానికి ఆనుషంగికం అని పేరు. ఒకనికి గంగలో మరణం తనకు తెలిసిగానీ ప్రయత్నంతో కానీ లేకుండా తానుగానే దైవవశంచేత సంభవిస్తున్నది. దీనివల్ల ఏర్పడే పుణ్యం అబుద్ధి పూర్వకం అని అనబడుతుంది. ఒక జాలరివాడు చేపలను పట్టుకోవడం కోసం సముద్రంలో మునుగుతున్నాడు. ఆ సమయంలో అర్ధోదయ సమయం. ఆ పుణ్యసమయంలో సముద్రంలో స్నానం చేసి, పుణ్యం సంపాదించాలి– అనే అభిప్రాయమే అతనికి లేదు. అయినప్పటికీ కాల మహిమ వల్ల అతనికి అప్పుడు చేసిన పని కారణంగా పుణ్యం కలుగుతున్నది. ఈ పుణ్యం యాదృచ్ఛికం అనబడుతుంది. ఆ విధంగానే ఒకడు ఒక బ్రాహ్మణునకు సేవ చేశాడు, ఇతనికి, అతడు బ్రాహ్మణుడు అని అంత మాత్రమే తెలుసు. కానీ, అతనికి కల విశేషమైన గొప్పతనానం తెలియదు. అతడు వాస్తవంలో వేద వేదాంగాలను పరిపూర్ణంగా అధ్యయనం చేసిన పరమైకాంతి. ఇతడు తెలియకపోయినా, ఆ పండితుని

గొప్పతనం వల్ల మిక్కిలి అ పుణ్యం ఇతనికి ఏర్పడుతున్నది. ఈ పుణ్యం సామాన్య బుద్ధిమూలం అనబడుతుంది. దయాదేవీ! ఈ విధంగా చెప్పబడిన పుణ్యాలన్నీ వాస్తవానికి చాలా గొప్ప పుణ్యాలు కావు. నీవు ఆ పుణ్యాలకు కొన్ని అల్పమైన ఫలాలను ఇచ్చి తీర్చవచ్చు. అయితే, నీవు ఆ విధంగా చేయడం లేదు. విశాలమైన నీ మనసులో ఆ పుణ్యాలు చాలా గొప్పవిగా, గొప్ప ఫలం ఇవ్వవలసినవిగా పరిపక్వ దశను కలిగినవిగా తోస్తున్నాయి. ఆ పుణ్యాలను పురస్కరించుకునే నీవు మోక్షంవరకు ఉండే ప్రయోజనాలను పొందడానికి తగిన ఉపాయాలను, ఆరు వారు కోరినదానికి అనుగుణంగా ప్రయోజనాలను గ్రహిస్తున్నావు ఇంతవరకు వారిని రక్షించడానికి ముందుకు రావడానికి అవకాశం లేకపోవడంవల్ల నీ మనసులో ఉండే సిగ్గు, సంకోచం అంతా ఇప్పుడు తీరిపోతున్నది.

***75) అతివిధిశివై రైశ్వర్యాత్మా ను భూతిరసై ర్జనాస్***
***అహృదయ మిహోపచ్ఛంద్యైషా మసంగదశార్థినీ |***
***తృషితజనతాతీర్థస్నా నక్రమక్షపితైనసాం***
***వితరసి దయే వీతాతంకా వృషాద్రిపతేః పదమ్ ॥***

దయాదేవీ! మహేశ్వరుడు అనే పేరు పొందిన శివుని సంపద చాలా గొప్పది. అంతకంటే పెద్దది బ్రహ్మ ఐశ్వర్యం. ఇది మిగిలిన అందరి ఐశ్వర్యాల కంటే చాలా పెద్దది. ఈ సంపదలు కలిగించే ఆనందం కంటే మిక్కిలి ఆనందాన్ని ఇవ్వగలిగినది కైవల్యం. కైవల్యం అంటే తన ఆత్మ

స్వరూపాన్ని సూచి అనుభవించడమే. ఈ ఆనందం మిగిలిన ఆనందాల కంటే చాలా గొప్పది. నిన్ను సేవించేవారికి శివుడు, బ్రహ్మ అనే వీరి అందరి ఐశ్వర్యం కంటే గొప్ప ఐశ్వర్యాన్ని, అంతకంటే గొప్పదైన కైవల్యాన్ని వారి కోరికకు తగినట్లు ఇస్తున్నావు. వాస్తవానికి వీటిని వారికి మనః పూర్వకంగా ఇస్తున్నావా? లేనే లేదు. ఎందుకు అంటే, ఇవి అన్ని శాశ్వతాలు కావు కదా. ఏదో ఒక కాలంలో నశించేపోతాయి. వీటికంటే గొప్పది, శాశ్వతమైనది అయిన మోక్షసామ్రాజ్యాన్ని చేతనులకు ఇవ్వడంలో కదా, నీకు ఆశ ఉన్నది. అయినా, వారు పోయే దారిలోనే పోయేటట్లు చేసి, తరువాత వారిని తగినటువంటి మార్గంలో పెట్టి సంస్కరించాలని భావిస్తున్నావు. లోకంలో మూఢుడు అయిన కుర్రవానిని అతడు పారిపోయే దారిలోనే విడచిపెట్టి, తరువాత ఋజువైన దారిలోకి తీసుకొని రావడం అనే క్రమం ఉన్నది. ఆ విధంగానే చేతనులు కోరే ఫలాలనే నీవు మొదట ఇచ్చి, వారికి ఆశ చూపిస్తున్నావు. తరువాత వారికి ఆ ప్రయోజనాలలో సంగం లేకుండా పోయే స్థితిని కలగడం కోసం ఎదురుచూసి వేచి ఉంటావు. కాని, వారు ఆ ప్రయోజనాలనే ఆశించి ఉంటారు. కాలక్రమంలో వారికి యథార్థమైన జ్ఞానం కలుగుతున్నది. మంచి జ్ఞానానికి అడ్డుగా ఉండే వారి పాపాలు నశించి పోతున్నాయి. వారు ఈ ప్రయోజనాల కోసమే భగవంతుని ఇంతకు ముందు సేవించినప్పటికీ, భగవంతుని అనుగ్రహంచేత వీరి పాపాలు తీరిపోతున్నాయి. ఒకడు తన దాహాన్ని తీర్చుకోవడం కోసమే పుణ్యతీర్థంలో స్నానం చేసినప్పటికీ, ఆ తీర్థంలోని గొప్పతనం ఇతని పాపాలను పోగొడుతుంది కదా. ఆ విధంగానే,

వీరి పాపాలు తీరిపోయి. మంచి జ్ఞానం ఏర్పడి, తాను ఇంతవరకు అనుభవించే సుఖాలు అన్నీ అస్థిరాలు అని గ్రహిస్తున్నారు. ఈ యథార్థస్థితి కలుగగానే, వీరికి ఆ సుఖాలలోని అనుబంధం తీరి పోతున్నది. అన్నిటికంటే గొప్పది అయిన మోక్షానందాన్ని పొందాలనే ఆశ కలుగుతున్నది ఈ విధంగా నీవే వారికి మంచి జ్ఞానం కలిగించి, మంచి దారిలోకి మెల్లిగా తీసుకొని వచ్చి, వారిని సంస్కరిస్తున్నావు. వారికి మోక్షంలో ఆశ కలుగగానే, దానికి తగిన ఉపాయమైన ప్రపత్తిని వారు చేసేటట్లు ప్రోత్సహిస్తున్నావు. వారిచే ఆ ప్రపత్తిని చేయించి మోక్షాన్ని నీవు ఇవ్వడం చేత, " పక్షపాతం వస్తుంది కదా! శాస్త్రక్రమానికి విరోధం కలుగుతుంది కదా! " అనే భయం కూడా నీకు తీరిపోతున్నది. తరువాత వారికి శ్రీవేంకటేశ్వరుడనే పరమపదనాథుని చరణాలలో నిరంతరంగా సేవ చేసేయడం అనే మోక్షానందాన్ని అనుగ్రహిస్తున్నావు. ఈ విధంగా అన్యఫలాలలో ఆసక్తిని కలిగినవారిని కూడా క్రమక్రమంగా మోక్షం పొందేటట్లు చేసే మహోపకారం నీకు తప్ప ఇంకా ఎవరికీ చేయడానికి సాధ్యపడుతున్నది?

*76) వృషగిరిసుధాసింధౌ జంతు ర్దయే నిహిత స్త్వయా*
*భవభయపరీతాపచ్ఛిత్త్యై భజన్న ఘమర్షణమ్ /*
*ముషితకలుషో ముక్తే రగ్రేసరై రభిపూర్యతే*
*స్వయ ముపనతైః స్వాత్మానందప్రభృత్యనుబంధిభిః ॥ 76 ॥*

దయాదేవీ! చేతనులకు శరీరం వారి కర్మవశంచేత ఏర్పడుతున్నది. ఈ శరీరం ఏర్పడుతున్నందున సంసారంలో అనేక విధాలైన భయాలు కలుగుతున్నాయి. శరీరం ఉండే కొద్దీ ఇంకా ఎన్నో దుఃఖాలు రాబోతున్నాయి. నీవు చేతననకు ఈ భయాన్ని, కలిగే దుఃఖాన్ని తీర్చాలని మనస్సులో తలచావు. అతనిని వేంకటాచలం పై ఉండే శ్రీనివాసుడు అనే అమృత సముద్రంలోకి తీసుకొని చేర్చి, అందులో మునిగేటట్లు చేశావు. శాస్త్రంలో అఘమర్షణం అనే ఒక స్నానం విధింపబడింది. పుణ్యతీర్థాలలో ఒకడు ఈ స్థానాన్ని చేస్తే, అతని తాపం తీరిపోవడంతో పాటు, అతడి పాపాలు కూడా నశించిపోతాయి. ఈ విధంగానే శ్రీనివాసుని దగ్గరకు నీవు చేర్చిన చేతనుడు తన పాపాలను తీరిపోవడంకోసం అమృత సముద్రంలో అఘమర్షణ స్నానం చేస్తున్నాడు, అంటే, సకల పాపాలను తీర్చగలిగిన ప్రపత్తిని చేస్తున్నాడు. దీనిని చేయించేదానవు కూడా నీవే. ఇతడు చేసే ఈ ప్రపత్తి వల్ల ఇతని పూర్వపాపాలు అన్నీ తీరిపోతున్నాయి. తరువాత, ఈ శరీరం చివర వచ్చే మోక్షాన్ని పొందేవరకు ఇతనికి తాముగానే కొన్ని విశేషానుభవాలు కలిగేటట్లు అనుగ్రహిస్తున్నావు. అతడు తనకు అంతర్యామియై నిలచి ఉండే భగవంతుని ఎల్లప్పుడూ భావించి, అనుభవిస్తున్నాడు. ఇది ఒక అనుభవం. ఇంకా, అర్చావతారంలో అభినివేషశాన్ని పొంది, అనుభవించి కైకర్యం చేస్తున్నాడు. ఇది ఇంకొక గొప్ప అనుభవం, ఆనందం. ఇంకా ఇటువంటి చాలా అనుభవాలను అతనికి కలిగించి నీవు అనుగ్రహిస్తున్నావు. ఈ అనుభవాలు అన్నీ అతనికి ఇక రాబోతున్న

మోక్షానందానికి ముందే వెళ్లే పరివారాలవంటివి. ఈ విధంగా నీవు చేతనునకు చేసే సహాయాలను లెక్కపెట్టడానికి సాధ్యమవుతుందా?

***77) అనితరజుషా మంతర్మూలే వ్యపాయపరిప్లవే***
***కృతవిదనఘా విచ్ఛిద్వ్యేషాం కృపే యమవశ్యతామ్ /***
***ప్రపదనఫలప్రత్యాదేశప్రసంగవివర్జితం***
***ప్రతివిధిముపాధత్సే సార్ధం వృషాద్రిహితైషిణా ॥ 77 ॥***

దయాదేవీ! వేరు ప్రయోజనాలను, అన్య దైవాలను అన్వేషించకుండా, నీ పాదాలలోనే ప్రపత్తి చేసే చేతనులు చాలామంది ఉన్నారు. వారు ప్రపత్తిని చేసిన తరువాత బుద్ధిపూర్వకంగా పాపాలు చేయరు. తెలియకుండా వారు చేసే పాపాలు వారి దరికి చేరవు. ఒక పర్యాయం దేశం, కాలం మొదలైన కారణాలచేత కొన్ని పాపాలు తాము తెలిచే చేయడం సంభవించవచ్చు. అయినా, నీవు వారిని యముని చేతిలో చిక్కుకునేటట్టు విడచిపెట్టవు. ప్రపత్తిని చేసినవారిని ఏ విధంగాను యమలోకం చేరడం లేదు అనేది వేద
నిర్ణయం. వారు చేసిన ప్రపత్తిని నీవు మరువకుండా, వారి విషయంలో కృతజ్ఞతాభావాన్ని కలిగి ఉన్నావు. వారు చేసిన పాపాలను లెక్కపెట్టడం అనేది దోషంగా భావించి, ఆ దోషాలు నీ దగ్గరకు రాని విధంగా చేస్తున్నావు. ప్రపత్తిని చేయగానే వారికి మోక్షం ఇవ్వాలని సంకల్పిస్తున్నావు. అందుచేత వారికి మోక్షానికి అడ్డు అని మాటకుకూడ అవకాశం ఉండకూడదు— అని భావిస్తున్నావు. అందరికీ మంచిని

కలిగించడంలోనే ఆశను కలిగినవాడైన శ్రీవేంకటేశ్వరునితో నీవు కలసి ఆలోచించి, ఒక నిర్ణయానికి వస్తున్నావు. వారికి ఏర్పడిన పాపాలకోసం ఏదైనా ఒక విధమైన ప్రాయశ్చితాన్ని కానీ, వేరొక ప్రపత్తిని ప్రాయశ్చిత్తంగాగాని చేసేటట్లు చేసి, వారిని పవిత్రులను చేస్తున్నావు. మూఢులై, ప్రాయశ్చిత్తం చేయనివారికి కూడా ఏదైనా చిన్న దండనను ఈ లోకంలోనే ఇచ్చి, వారిని పవిత్రులను చేసి, వారు అడిగిన కాలంలో పరమపదానికి చేరుస్తున్నావు. నీ ప్రయత్నం లేకపోతే ఈ హితాలు ఏర్పడుతాయా?

*78) క్షణవిలయినాం శాస్త్రార్థానాం ఫలాయ నివేశితే*
*సురపితృగణే నిర్వేశాత్ ప్రాగపి ప్రళయం గతే |*
*అధిగతవృషక్ష్మా భృన్నా థామకాలవశంవదాం*
*ప్రతిభువమిహ వ్యాచఖ్యు స్త్వాం కృపే నిరుపప్లవామ్ ॥*

దయాదేవీ! శాస్త్రాలు యాగం, హోమం, దానం మొదలైన కర్మలు వారు వారు కోరే ప్రయోజనాలను పొందడం కోసం చేయమని విధిస్తున్నాయి. ఆయా కర్మలు పూర్తి అయిన వెంటనే ఆ కార్యాలు నశించి పోవడం వల్ల, అవి స్థిరంగా నిలచి ఫలాన్ని ఇవ్వడం సాధ్యం కాదు. అందువల్ల, ఆ ఫలాలను ఇవ్వడం కోసం నీవు దేవతలను, పితృదేవతలను నియమిస్తున్నావు. వారు, కర్మలను చేసేవారికి ఆ కర్మలకు తగిన ఫలాలను ఇస్తున్నారు, ఆ విధంగా వారు ధర్మాలను చేసినవారికి ఫలాలను ఇవ్వడానికి ముందే తాము జీవించే కాలం పూర్తి

అయి, వారు నశించి పోతే, అప్పుడు ఆ ధర్మాలను చేసేవారికి ఎవరు ఫలాలను ఇస్తారు? దయాదేవీ! వారికి ప్రతినిధిగా నీవే నిలచి ఫలాలను ఇస్తున్నావని శాస్త్రం అభ్యసించిన పెద్దలు చెబుతున్నారు. నీవు శ్రీవేంకటేశ్వరుని ఏనాడు విడవకుండా ఉండేదానవు. నీవు కాలానికి కట్టుబడినదానవు కాదు. నీకు ఏనాడు నాశం అనేది లేదు. నిన్ను అడ్డుకునేవారుకూడా ఎవరూ లేరు. ఈ విధంగా అన్యఫలాలను కోరేవారికి దేవతల, పితృదేవతల ద్వారా, వారు నశించినప్పుడు సాక్షాత్తు నీవు ప్రయోజనాలను ఇస్తున్నావు. దీనిని చూసినప్పుడు, ఆ యా దేవతల కోసం నీవు ప్రతినిధిగా అంటే, జామీను ఇచ్చేదానివిగా, నిలచినట్లు నాకు తోస్తున్నది.

***79) త్వదుపసదనా దద్య శ్వో వా మహాప్రళయేஉపి వా***
***వితరతి నిజం పాదాంభోజం వృషాచలశేఖరః |***
***తదిహ కరుణే తత్తత్క్రీడాతరంగపరంపరా -***
***తరతమతయా జుష్టాయాస్తే దురత్యయతాం విదుః ॥***

దయాదేవీ! నిన్ను శరణు పొందిన చేతనునకు అతని కోరికకు తగినట్లు ఈనాడో, లేక, మరునాడో, లేక, ప్రళయ కాలంలోనో శ్రీవేంకటేశ్వరుడు ఫలాన్ని ఇస్తున్నాడు. ఆ ఫలం ఏది? అతని శ్రీచరణపద్మాలే. అంటే, పరమపదనాథుని శ్రీచరణాలలో నిరంతరంగా కైంకర్యం చేయడం అనే మోక్షమే. నిన్ను శరణు పొందినవానికి శ్రీనివాసుడు మోక్షాన్ని ఇచ్చి తీరాలి. అతడు నిన్ను కాదని నడవడం

అతనికి సాధ్యం కాదు. చేతనులలో కొందరు వెంటనే మోక్షం పొందాలని కోరవచ్చు, కొందరు కొంత సమయం తరువాత పొందాలని కోరవచ్చు. ఇంకా కొందరు, చాలా కాలానికి తరువాత మోక్షాన్ని కోరవచ్చు. వారు వారు కోరిన రీతికి తగినట్లుగా, నీకు అణగి ఉండే భగవంతుడు, ప్రయోజనాన్ని ఇవ్వాలి. నీవు పాపాలను పోగొట్టగలిగిన ఒక పెద్ద నదివంటిదానవు. ఆ యా చేతనులు నిన్ను సేవించడానికి తగినట్లు వారిని నీవు స్వీకరించి, వారి విషయంలో పలు లీలలను చేస్తున్నావు. ఆ లీలలు నది కెరటాలవంటివి. ఈ లీలలలో కొన్ని వెంటనే ప్రయోజనాన్ని ఇస్తాయి. కొన్ని కొంతకాలం జరిగిన తరువాత ఫలాన్ని ఇస్తాయి. మరికొన్ని లీలలు చాలా కాలం జరిగిన తరువాత ఫలాన్ని ఇస్తాయి. ఏ విధంగా అయినా మోక్షాన్ని ఇవ్వడం నిశ్చయం. ఒకసారి నీకు లక్ష్యం అయినవాడు ఫలాన్ని పొందకుండా ఉండడు. ఈ విధంగా లీలలను చేస్తున్న నీకు విధేయుడై చేతనులకు శ్రీనివాసుడు ఫలాలను ఇస్తున్నాడు. ఈ విషయాలను అన్నిటిని దృష్టిలో పెట్టుకొని పెద్దలు "నిన్ను మీరి ఎవరూ వర్తించడం సాధ్యం కాదు"– అని నిశ్చయించారు.

*80) ప్రణిహితధియాం త్వత్సంపృక్తే వృషాద్రిశిఖామణౌ*
*ప్రస్నుమరసుధాధారాకారా ప్రసీదతి భావనా ।*
*దృఢమితి దయే దత్తాస్వాదం విముక్తివలాహకం*
*నిభృతగరుతో నిధ్యాయంతి స్థిరాశయచాతకాః ॥*

దయాదేవీ! శ్రీవేంకటాచల శిఖరానికి అందం ఇచ్చే ఒక నీలమణివలె శ్రీనివాసుడు ప్రకాశిస్తున్నాడు. మోక్షాన్ని పొందడం కోసం అతని సన్నిధిలో మనసును నిలుపుకొని, నిరంతరంగా ధ్యానించి, భక్తియోగాన్ని కొందరు మహానుభావులు చేస్తున్నారు. ఆ భక్తి యోగం పూర్తి అయ్యేవరకు ధ్యానం వృద్ధి చెందుతూనే పోవాలి కదా. శ్రీనివాసుడు వీరికి ఈ ధ్యానం ప్రతిదినం ఇంకా ఇంకా వృద్ధి చెందుతూనే పోయేటట్లు అనుగ్రహిస్తున్నాడు. ఎందువల్ల శ్రీనివాసుడు ఈ విధంగా చేతనులను అనుగ్రహిస్తున్నాడు? ఏతనులకు ఎల్లప్పుడూ హితాన్నే చేయాలని కోరే నీవు అతనితో చేరి ఉన్నదానివల్లనే కదా. ఇది నిశ్చయం. ఇందులో కొంచెం కూడా సందేహం లేదు. ఈ విధంగా వారు చేసే జ ధ్యానం చాలా పెద్దది అయిన ఒక అమృతధారవలె మనస్సుకు గొప్ప ఆనందాన్ని కలిగించేదిగా ఉంటుంది. ఈ విధంగా యోగులకు ధ్యానాన్ని వృద్ధి చేసి, ధ్యానించే స్థితిలో ఆనందం అనే ఊటను ఊరేటట్లు చేసి, మోక్షానందం అనే వర్షాన్ని వర్షిస్తున్నది శ్రీనివాసుడు అనే కాలమేఘం. ఇంకా ఇంకా నిలచి ఉండే ఈ కాలమేఘాన్ని ఎదురుచూసి నిలచి ఉంటారు, భక్తి యోగాన్ని చేసే మహానుభావులు అనే చాతక పక్షులు. వర్షజలాన్ని తప్ప ఇంకొక జలాన్ని తాగని చాతకాలు తమ రెక్కలను కూడా కదపకుండా, ఏ ప్రయత్నాన్ని చేయకుండా, వర్షపు నీరుకోసం మేఘాన్నే ఎదురుచూస్తూ, దానినే ధ్యానిస్తూ ఉంటాయి. ఆ విధంగానే, భక్తియోగాన్ని చేసే పుణ్యాత్ములు ఏ విధమైన అన్యప్రయోజనాన్ని మనస్సుతో కూడా భావించడం లేదు, వరు ఏ దైవాన్ని అన్వేషించడం లేదు. దృఢమైన

మనోనిశ్చయంతో, మనసులో నెమ్మదితో శ్రీవేంకటేశ్వరునే ఎల్లప్పుడూ ధ్యానిస్తూ, భక్తియోగం పూర్తిగా కాగానే అతడు అనుగ్రహించబోయే మోక్షానందాన్ని ఎదురుచూస్తూ ఉంటారు. ఈ విధంగా భక్తియోగం చేసేవారుకూడా నీవల్ల తమ యోగం వృద్ధి పొందించుకొని, దానిని ఋజువుగా నిర్వహిస్తూ, దానిని కొనసాగిస్తున్నారు. ఇది నిశ్చయం.

*81) కృపే విగతవేలయా కృతసమగ్రపోషైస్త్వయా*
*కలిజ్వలనదుర్గతే జగతి కాళమేఘాయితమ్ ।*
*వృషక్షితిధరాదిషు స్థితిపదేషు సానుప్లవైః*
*వృషాద్రిపతివిగ్రహైర్వ్యపగతాఖిలావగ్రహైః ॥*

దయాదేవీ! భగవంతుడు నీ ప్రేరణచేత శ్రీవేంకటాద్రి మొదలైన దివ్యదేశాలలో అర్చారూపాలను పరిగ్రహించి నిలచి ఉన్నాడు. అతని అర్చాతిరుమేని నల్లని మేఘంవలె నిలచి ఉండి, లోకాలను రక్షిస్తున్నది. మేఘాలు తీరాన్ని చూడడం సాధ్యం కాని గొప్ప సముద్రంలో ఉండే నీటిని తాగి, పుష్టి అయిన రూపాన్ని పొందేటట్టే, శ్రీవేంకటేశ్వరుని రూపాలుకూడా అవధి లేకుండా బవృద్ధి చెందే నీచేత భక్తులు పరిపూర్ణంగా అనుభవించేటట్లు మంచి పుష్టిని పొందుతున్నాయి. వర్షం కురవడానికి కొన్ని ఆటంకాలు కలిగి, భద్రవాలు వచ్చేటట్లుగా, భక్తులను రక్షించడంలో అడ్డుగా ఉండే భగవంతుని కోపం, నిగ్రహ సంకల్పం మొదలైన ఉపద్రవాలు తొలగి, అర్చారూపాలలో అనుగ్రహమే ముందుకు వస్తున్నది. మేఘాలు పర్వత ప్రదేశాలలో తిరిగేటట్లే, ఈ అర్చారూపాలు కూడా, శ్రీ వేంకటాద్రి

వనగిరి, తిరునీర్మలై మొదలైన పర్వత ప్రాంతాలలో, మిగిలిన స్థానాలలోను నడయాడుతున్నాయి. మేఘాలు తాము వర్షం కురవడానికి గాలి, మెరుపు, పిడుగు మొదలైనవాటిని సహాయంగా చేసుకున్నట్లే, భగవంతుడుకూడా అర్చారూపంగా అవతరించేటప్పుడు అనంత గరుడ విష్వక్సేన ఇత్యాది నిత్యసూరులతో, సుదర్శన పాంచజన్యాది దివ్యాయుధాలతో కూడి అవతరిస్తున్నాడు. మేఘాలు అరణ్యంలో ఉండే అగ్నిచేత బాగా తపింపబడిన ప్రదేశాలలో తమ నీటిని వర్షించి, దుర్భిక్షాలను తొలగించి, ఉజ్జీవింప చేసేటట్లే, భగవంతుని అర్చారూపాలు కూడా కలియుగం అనే అగ్నిచేత వివేకాన్ని కోల్పోయి, తమోగుణం తల ఎత్తినందున నశించిపోయి ఉండే చేతనులు తమను సేవించడంతో పాపాలు తొలగి, సత్వగుణం అభివృద్ధి చెంది, మంచి జ్ఞానాన్ని పొంది, ప్రపత్తిని చేసి, మోక్షం పొందడానికి కారణం అవుతున్నాయి. అర్చారూపాల ఇంతటి వైభవానికి కారణం ఎవరు? నీవేకదా. నీవే సందేహం లేదు. కరుణ లేకపోతే భగవంతుడు ఈ అర్చారూపాలను పరిగ్రహించి ఉండేవాడు కాదు.

*82) ప్రసూయ వివిధం జగత్ తదభివృద్ధయే త్వం దయే*

*సమీక్షణవిచింతనప్రభృతిభిః స్వయం తాదృశైః ।*

*విచిత్రగుణచిత్రితాం వివిధదోషవైదేశికీం*

*వృషాచలపతే స్తనుం విశసి మత్స్యకూర్మాదికామ్ ॥*

దయదేవీ! శ్రీవేంకటేశ్వరుడు అర్చారూపాలవలెనే మత్స్య కుర్మా హంసాది విభవావతారాలను కూడా పరిగ్రహించాడు. ఆయా రూపాలలో నీవే లోపల ప్రవేశించి అవతార కార్యాలను చేయిస్తున్నావు. కరుణ లేకపోతే ఈ అవతారాలకు అవకాశం ఎక్కడ ఉన్నది? ప్రళయ దశలో ఏ జ్ఞానం లేకుండా, ఏ కార్యం చేయ లేకుండా పడి ఉండే జీవాత్మలను ఉజ్జీవింప చేయడంకోసం వారికి శరీరాన్ని, ఇంద్రియాలను ఇస్తున్నావు. ఆయా ప్రాణులు తాము చేసిన తమ కర్మలకు తగినట్లుగా సుఖదుఃఖాలను అనుభవించేటట్లు చేస్తున్నావు. ఈ విధంగా పలు విధాలుగా ఉండే లోకాన్ని సృష్టించేదానవు నీవే. ఈ ప్రాణులు అన్ని నీ సంతానమే వీటిని పోషించి. కాపాడడం అనేది వీటిని కన్నటువంటి నీ బాధ్యత అవుతున్నది. ఇందుకోసం భగవంతుడు ఎత్తిన అవతారరూపాలలో ఇతరుల ప్రేరణ లేకుండా నీవుగానే వాటిలోపల ప్రవేశిస్తున్నావు. శ్రీవేంకటేశ్వరుని మత్స్య కూర్మ హంసాది అవతార రూపాలు ఆయా ప్రాణుల రూపాయలకు, తగినట్లుగా వేరు వేరు గుణాలను కలిగినవి. చేపలు తమ గుడ్లను తమ కంటి చూపుతోనే పోషిస్తాయి. కుర్మాలు తాము మనస్సుతో భావించడం ద్వారా తమ గుడ్లను చక్కగా పెంచుతాయి. హంసలు తమ గుడ్లను తమ రెక్కలతో ఆలింగనం చేసుకొని పొదగడం ద్వారా వాటిని పెంచుతాయి. ఈ విధంగా ప్రాణిశాస్త్రం తెలుపుతున్నది. దయ అనే నీవు భగవంతుని మత్స్యరూపంలో ప్రవేశించి ప్రాణులను కటాక్షించడం ద్వారా పోషిస్తున్నావు. కూర్మరూపంలో ప్రవేశించి చేతనులను నీవు నీ

మనసుతో భావించడం ద్వారా వారికి హితాన్ని కలిగిస్తున్నావు. హంసరూపంలో ప్రవేశించి నీవు జీవాత్మలను ప్రేమతో ఆలింగనం చేసికోవడం ద్వారా వాటిని ఉజ్జీవింప చేస్తున్నావు. ఈ విధంగా చేతనులు ఉజ్జీవించడానికి నీవు ప్రవేశించే అవతార రూపాలలో, మత్స్య కూర్మాదిరూపాలలో ఉండే ప్రాణులకు ఉండే దోషం ఏమీ లేదు. ఏ రూపాన్ని పొందినా ఆ భగవంతుని తిరుసేని శుద్ధసత్వమయంగానే ఉంటుంది కదా!

*83) యుగాంతసమయోచితం భజతి యోగనిద్రారసం*
*వృషక్షితిభృదీశ్వరే విహరణక్రమాజ్జాగ్రతి ।*
*ఉదీర్ణచతురర్ణవీకదనవేదినీ మేదినీం*
*సముద్ధృతవతీ దయే తదభిజుష్టయా దంష్ట్రయా ॥*

దయాదేవీ! శ్రీవేంకటేశ్వరుడు అనే పరమ పురుషుడు ప్రళయకాలంలో యోగనిద్రను పొందుతున్నాడు. అంటే, అతడు తన కన్నులను మూసుకొని కదలకుండా సుఖంగా పరుండి, మళ్లీ సృష్టి చేసి చేతనులను మంచి దారిలో పెట్టడానికి తగిన ఆలోచనలో మునిగి, సకల వస్తువులతో కూడిన తనను అనుభవిస్తూ, ఆనందదశలో ఉంటాడు. తరువాత ఆ స్థితి పోయి యోగనిద్రనుండి పైకి లేస్తాడు. ఎందుకోసం? మళ్లీ లోకాన్ని సృష్టించి, లీలావిభూతి అనే ఈ సంసార మండలంలో తన లీలలను చేయడం కోసమే. ఆ స్థితిలో బ్రహ్మలోకంవరకు ఉండే అన్ని లోకాలను ముంచి వేస్తుందా? అనేటట్లుగా అన్ని సముద్రాలు ఒకటిగా

కూడి ఉప్పొంగి లేచి, అన్ని దిశలలోను వ్యాపించి, అంతటా ఒకే జలమయంగా ఉంటుంది. అప్పుడు భూమి పాతాళంలో ఒక మూలలో అణగిపోయి బాధపడుతూ ఉంటుంది. ఈ విధంగా భూదేవి సముద్రం లోపల మునిగిపోయి ఉన్నందున బాధపడుతూ ఉండడాన్ని దయాదేవివి అయిన నీవు తెలుసుకున్నావు. ఆమె దుఃఖాన్ని చూచి సహించలేక, నీవు ఆమెను పై తెచ్చి ఉద్ధరించాలని కోరావు. అందుకోసం శ్రీవేంకటేశ్వరుని వరాహావతారం ఎకత్తేటట్లుగా ప్రేరేపించావు. మహాసముద్రంలో ఒక మూలలో మునిగి, పడి ఉండే భూదేవిని ఆ వరాహ స్వామి తన కోరదంతంతో గుచ్చి పైకెత్తి, తగినటువంటి చోట స్థిరంగా నిలిపేటట్టు చేశావు.

*84) సటాపటలభీషణే సరభసాట్టహాసోద్భటే*
*స్ఫురత్క్రుధి పరిస్ఫుటద్భ్రుకుటికేఽపి వక్త్రే కృతే /*
*దయే వృషగిరీశితు ర్దనుజడింభదత్తస్తనా*
*సరోజసదృశా దృశా సముదితాకృతి ర్దృశ్యసే ॥*

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! హిరణ్యకశిపుడు అనే అసురుడు తన కుమారుడు, పరమ భాగవతుడు అయిన ప్రహ్లాదాళ్వాన్ ను అనేక విధాలుగా బాధపెట్టి క్రూరమైన పనులను చేశాడు. అందువల్ల విజృంభించి పైకి లేచే కోపంతో భగవంతుడు, హిరణ్యకశిపుడు తట్టిన స్తంభంనుండి నరసింహరూపంతో ఆవిర్భవించి, ప్రత్యక్షమయ్యాడు, అప్పుడు, నరసింహరూపానికి తగినట్లుగా స్వామి ముఖం చూసినవారికి చాలా

భయం కలిగించింది. హిరణ్యకశిపుని వధించాలి అనే వేగంతో నరసింహుని నోటినుండి వేగంగా పైకి లేచిన అట్టహాసంవల్ల ఆ స్వామి ముఖం చాలా ఉగ్రంగా ఉన్నది. కనుబొమ్మలు ముడి పడి చాలా కదిలాయి. ఆ స్థితిలో ఆ స్వామి ముఖాన్ని చూచినప్పుడే అతని మనసులో ఉండే పట్టరాని కోపం చాలా స్పష్టంగా వ్యక్తమవుతున్నది, ఆ అద్భుత రూపాన్ని దర్శించినపుడు కలిగిన గొప్ప ఆశ్చర్యంతోను, తిరుముఖంలో కోపకణాలను చూసినపుడు కలిగిన గొప్ప భయంతోనూ హిరణ్యకశిపుడు కొంచెం కూడా కదలకుండా అక్కడే నిలబడిపోయాడు. గొప్ప అగ్ని పైకి లేచి మండినట్లుగా ఉండే నరసింహుని చూపులు హిరణ్య కశిపునిపై పడ్డాయి. అదే సమయంలో, అతని కుమారుడైన ప్రహ్లాదునిపై వికసించిన తామరపూలవంటి తిరునేత్రాలు చల్లని కటాక్షాలు ప్రసరించాయి. ఇది అంతా ఎవరి వల్ల జరిగింది? దయాదేవివి అయిన నీవే ఆ తిరునేత్రాల రూపాన్ని ధరించి, వాటినుండి పైకి లేచే చల్లని కటాక్షాలతో హిరణ్యునివల్ల బాధపడి వాడిన ప్రహ్లాదునిపై చాలా చల్లగా ప్రసరించేటట్లు అనుగ్రహించావు. నీవు ఈ విధంగా చేయడం ఆ అసుర బాలునకు తల్లిగా నిలచి స్తన్యాన్ని ఇచ్చి పెంచినట్లుగా అయినది. ఈ విధంగా నరసింహుని తిరునేత్రాలలో నుండి ఒకే సమయంలో రెండు విధాలైన కార్యాలను చేసే ఒక రూపాన్ని ధరించి, రెండు విరుద్ధమైన కార్యాల అపురూపమైన చేరికను చేసినదానవు నీవే కదా.

***85) ప్రసక్తమధునా విధిప్రణిహితైః సపర్యోదకైః***

***సమస్త దురితచ్ఛిదా నిగమగంధినా త్వం దయే |***

***అశేషమవిశేషత స్త్రిజగదంజనాద్రీశితుః***

***చరాచరమచీకరశ్చ రణపంకజేనాంకితమ్ ॥***

దయాదేవీ! దేవేంద్రుని ముల్లోకాలను, పదవిని అపహరించి తానే రాజు అయిన బలిచక్రవర్తిని అణచమని భగవంతుని దేవతలు ప్రార్థించారు. భగవంతుడు అందుకోసం బ్రహ్మచారి వేషంతో వామనావతారాన్ని ఎత్తాడు. బలి దగ్గరకు వెళ్లి మూడు అడుగుల నేలను యాచించి పొందాడు. తరువాత త్రివిక్రమ రూపాన్ని పొంది, చాలా పెద్ద రూపం ధరించి, తన కుడి పాదాన్ని భూమిపైన పూర్తిగా వ్యాపింప చేసి, కొలిచాడు. ఎడమ పాదాన్ని బ్రహ్మలోకం వరకు వ్యాపింప చేశాడు. బ్రహ్మ తన ప్రయత్నం ఏమీ లేకుండానే తన భాగ్యవశంచేత తాను ఉండే చోటుకు వచ్చిన స్వామి పాదాన్ని చూసి, ఆనంద పరవశుడు అయ్యాడు. వెంటనే ఆ పాదాన్ని దివ్యతీర్థంతో అభిషేకం చేశాడు. ఆ తీర్థధార మధువర్షమై భగవంతుని శ్రీచరణాలలో చేరింది. శ్రీచరణపద్మంలో తేనె స్రవించడం అనేది యుక్తమే కదా. ఈ శ్రీ చరణ పద్మాలుకూడా సామాన్యమైనవా? అవి సోకిన చోట ఉన్నవారి పాపాలు అన్ని సమూలంగా నశించిపోతాయి కదా. ఈ పాదాలను వేదాలు కీర్తిస్తునందున ఎల్లప్పుడూ వేదంలోని పరిమళ వీటిలో వీస్తున్నది. ఈ విధంగా త్రివిక్రమరూపాన్ని ధరించిన శ్రీ వేంకటేశ్వరుని రెండు శ్రీ చరణాలలో దయాదేవివి అయిన నీవు ప్రవేశించి, ఒక పాదాన్ని క్రింది లోకంలోనూ, ఇంకొక పాదాన్ని పై లోకంలోనూ వ్యాపించేటట్టు చేశావు. పాతాళం, భూలోకం, బ్రహ్మలోకం అనే మూడు లోకాలను అతడు తన పాదపద్మంతో ముద్రించాడు. ముద్రించేటప్పుడు

ఆ లోకాలలో ఉండే వస్తువులలో తారతమ్యాన్ని చూశాడా? హెచ్చుతగ్గులు మొదలైన తేడాలు ఏమీ లేకుండా స్థావరం జంగమాలు అనే సకల వస్తువులలోనూ కదా అతడు తన పాదాన్ని పడేటట్లుగా చేశాడు. నీవు లేకపోతే మూడు లోకాలకు ఈ భాగ్యం లభిస్తుందా? ఈ విధంగా సకల వస్తువులలోను అతడు తన పాదముద్ర అనే శ్రీవైష్ణవ చిహ్నాన్ని ముద్రించేటట్లుగా చేసి, సకల లోకం ఆ భగవంతునకు శేషం అనే అంతరార్థాన్ని లోకానికి తెలియజేశావు. ఈ విధంగా బలిని అణచడం అనే పేరుతో ముల్లోకాలను రక్షించిన గొప్పతనం నీకు తప్ప ఎవరికీ ఉన్నది?

*86) పరశ్వథ తపోధన ప్రధనసత్త్రతూపాకృత -*
*క్షితీశ్వరపశు క్షరత్క్షతజ కుంకుమస్థాసకైః /*
*వృషాచలదయాళునా నను విహర్తుమాలిప్యథాః*
*నిధాయ హృదయే దయే నిహతరక్షితానాం హితమ్ //*

దయాదేవీ! శ్రీవేంకటేశ్వరుని పరశురామునిగా అవతరించేటట్లు నీవే చేశావు. మిగిలిన అవతారాలకు, ఈ అవతారానికి మధ్య చాలా తేడా ఉన్నది. మహాపుణ్యం చేసిన ఒక చేతనునిలో భగవంతుడు ఆవేశించి చేసిన ఆవేశావతారం ఇది. ఈ అవతారంలో దుష్టులైన రాజులను సమూలంగా నాశనం చేసేటట్టు చేశావు. పరశురాముడు గొడ్డలిని తనకు ఆయుధంగా గ్రహించి దుష్టులైన రాజుల నందరిని వధించి వేశాడు. ఇటువంటి కఠినమైన కృత్యాలను దయాదేవివి అయిన నీవు చేయించడం

ఏ విధంగా తగినది? అని పామరులు భావించవచ్చు. దీని వాస్తవం వేరుగా ఉన్నది. లోకంలో జనులు శాస్త్రాలు విధించిన యాగాలను చేయడంలో యాగపశువును వధించి హోమం చేస్తారు. పై పైన చూసినప్పుడు ఆ కార్యం ప్రాణి హింస అని తోస్తుంది. వాస్తవంలో ఆ పశువు యాగానికి ఉపయోగపడి, పుణ్యలోకం చేరి, ఆనందాన్ని పొందడంచేత ఆపశువుకు మంచి కలుగుతుంది అని శాస్త్రం చెబుతున్నది. పరశురామముని రాజులతో చేసిన యుద్ధం ఒక గొప్ప యజ్ఞంవంటిదే ఆ యజ్ఞానికి పశువులు క్షత్రియులు. వారు తాము చేసిన దుష్టకార్యాలకు ఫలంగా పరశురాముని చేతిలో వధింపబడ్డారు. అందుచేత తాము పాపం తొలగినవారై స్వర్గానికి చేరారు. పాపం పాపాలను చేసిన మానవులు, రాజులు మొదలైనవారు దండనను పొంది, పవిత్రులై పుణ్యలోకం చేరుతారని శాస్త్రం చెబుతున్నది. నీవు శ్రీవేంకటేశ్వరుని వద్ద నిండుగా ఉన్నదానిపై, పరశురామ రూపాన్ని ధరించిన అతని ద్వారా దుష్టులను వధింపచేసి, వారిని చేసి మంచిని పొందేటట్లు చేయడం కూడా నీకు తగినదే అవుతున్నది. మంచి కార్యమే అవుతున్నది. ఈ విధంగా నీ నాయకుడైన శ్రీవేంకటేశ్వరుడు రాజులకు మంచిని కలిగించాలని అనుకొని, వారిని వధించి, వారి రక్తపంకాన్ని కుంకుమ పంకంవలె నీపై పూసి క్రీడించాడు.

***87) కృపే కృతజగద్ధితే కృపణజంతుచింతామణే***

***రమాసహచరం తదా రఘుధురీణయంత్యా త్వయా***

*వ్యభజ్యత సరిత్పతిః సకృదవేక్షణాత్ తత్క్షణాత్*

*ప్రకృష్టబహుపాతకప్రశమహేతునా సేతునా ॥*

దయాదేవీ! ఉన్నతులు, నీచులు అనే భేదం ఏమీ లేకుండా లోకం అంతటికీ మంచిని కలిగించాలని నీవు అనుకుంటావు. వేరు ఎవరిని ఆశ్రయించకుండా, నిన్ను శరణు పొందిన చేతనులకు వారు కోరే అన్ని విధాలైన ప్రయోజనాలను నీవు ఇవ్వడం చేత నీవు చింతామణివంటిదానవుగా ఉన్నావు. లోకం రావణునివల్ల కలిగిన బాధను సహించలేక, తల్లడిల్లినప్పుడు, నీవు దేవతల ప్రార్ధనకు జాలిపడి, ఏనాడూ లక్ష్మీని విశ్లేషించని శ్రీవేంకటేశ్వరుని సీతాదేవితో శ్రీరామునిగా అవతరింప చేశావు. శ్రీరాముని చేతిలో రావణుడు మొదలైన దుష్టులు నశించారు. ప్రపంచం శాందిని పొంది ఆనందించింది. విధంగా నీవు ఆ కాలంలోని జనులకు సహాయం చేయడం మాత్రమేనా? ఆ కార్యాలు అన్నిటికీ మించిన ఒక పెద్ద మంచిని కదా నీవు తరువాత కాలంలో జన్మించబోయే జనులకు చేశావు. అది ఏమంటే, శ్రీరాముడు తన సేనతో సముద్రాన్ని దాటి లంకను చేరడానికి సముద్రంలో అడ్డంగా ఒక సేతువును నిర్మించేటట్లు చేశావు. ఇంతకంటే గొప్పదైన మంచి ఇంకొకటి ఉన్నదా? ఈ సేతువును ఒకసారి దర్శిస్తే చాలు కదా. ఆ క్షణంలోనే, వేరు ఏ కార్యం చేత తొలగని, మహా పాపాలు అన్నీ తొలగిపోయి నశించిపోతాయి కదా. ఈ విధంగా రాబోయే కాలంలో జన్మించబోయే జనులు కూడా మంచి గతిని పొందే చెట్లు నీవు చేసిన గొప్ప ఉపకారం నోటితో వర్ణించడానికి సాధ్యమైనదా?

*88) కృపే పరవత స్త్వ యా వృషగిరీశితుః క్రీడితం*
*జగద్ధిత మశేషత స్తదిద మిత్థ మర్థాప్యతే /*
*మదచ్ఛలపరిచ్యుతప్రణత దుష్కృతప్రేక్షితైః*
*హతప్రబలదానవై ర్హలధరస్య హేలాశతైః ॥*

దయాదేవీ! నీ నాథుడైన శ్రీవేంకటేశ్వరుడు నీవు చెప్పినదానిని అంతటినీ చేసేటట్లు నీకు వశమై ఉన్నాడు. అతనిని శ్రీకృష్ణునకు అన్న అయిన బలరామునిగా అవతరింప చేశావు. క్షత్రియుడై పుట్టిన బలరాముడు ఒక నాగలిని ఆయుధంగా చేసుకున్నాడు. మిగిలిన ప్రభువులువలె వర్తించాలని కోరి, తాను మధువును సేవించే అలవాటును చేసుకొన్నాడు. అందువల్ల మనస్సులో మైకాన్ని పొందినట్లు ప్రదర్శించాడు. లోకంలో కూడా మధువును సేవించినవారికి ఆ సమయంలో వస్తువులు యథాతథంగా కన్నులకు కనిపించకపోవడాన్ని చూస్తున్నాము. బలరాముడు తాను మధువుచేత పొందిన మైకం అతడు భక్తుల దోషాలను చూడకుండా ఉండడానికి కారణమైనట్లే ప్రదర్శించాడు, మహా అపరాధులైన దుర్యోధనాదుల దోషాలు కూడా బలరాముని కంటికి తోచలేదు కదా. లోకానికి హానిని బాధలను కలిగించిన ప్రలంబుడు మొదలైన దుష్టులను బలరాముడే వధించాడు. ఈ విధంగా బలరాముడు చేసిన లీలలు వందలాది సంఖ్యలో ఉన్నాయి. అతడు మధువు చేత మైకాన్ని పొంది చేసే కార్యాలతో సహా, అతని లీలలు అన్నీ లోకానికి మంచిని కలిగించేవిగానే ఉన్నాయి. వీటి వల్ల ఒక వాస్తవం

వ్యక్తమవుతున్నది. అది ఏమంటే, శ్రీవేంకటేశ్వరుడు దయాదేవివి అయిన నీకు లోబడి ఏ కార్యాలను లీలగా చేసినా, అవి అన్ని లోకానికి మంచిని కలిగించేవిగానే అవుతున్నాయి.

*89) ప్రభూతవిబుధద్విషద్భరణఖిన్నవిశ్వంభరా -*
*భరాపనయనచ్ఛలాత్ త్వమవతార్య లక్ష్మీధరమ్ /*
*నిరాకృతవతీ దయే నిగమసౌధదీపశ్రియా*
*విపశ్చిదవిగీతయా జగతి గీతయాఽధం తమః ॥*

దయాదేవీ! ఈ భూదేవి సకల ప్రాణులను ఓర్పుతో ధరించి ఉన్నది. అయితే, పాపులను దుష్టులను ధరించడం ఆమెకు సాధ్యం కాదు వారిని ధరించడం గొప్ప భారంగా అనిపిస్తుంది, చాలా దుఃఖంగా తోస్తుంది. అసురులు దేవతలకు సహజంగానే శత్రువులు. ఒక సమయంలో కాలనేమి, కంసుడు, శిశుపాలుడు మొదలైన దుర్మార్గులు పుట్టి, తమ బలంతో లోకానికి దుఃఖాన్ని కలిగించారు. ఇటువంటి పాపులను ధరించడంవల్ల భూదేవి చాలా దుఃఖాన్ని పొందింది. వారి భారాన్ని మోయలేకపోయింది. దయాదేవివి అయిన నీవు భూదేవియొక్క భారాన్ని తగ్గించాలని అనుకున్నావు. అందుకోసం శ్రీనివాసుని రుక్మిణీదేవికి నాథుడైన శ్రీకృష్ణునిగా అవతరించేటట్లు చేశావు. ఆ స్వామిని పురస్కరించుకొని దుష్టులను సంహరింపచేసి, భూదేవికి కల భారాన్ని పోగొట్టావు. ఈ విధంగా ఇందుకోసం భగవంతుని శ్రీకృష్ణునిగా అవతరింప చేయడం అనేది పేరుకు మాత్రమే. ఈ అవతారానికిని

నిజమైన దృష్టి పేరు. అది ఏమి అంటే, లోకంలో ఉండే చేతనులు మంచి జ్ఞానాన్ని పొందకుండా, నడిచే దారి తెలియకుండా, అజ్ఞానం అనే దట్టమైన చీకటిలో మునిగిపోయి ఉన్నారు. వారు తరించి, మంచి దారిలో వర్తించడానికి ఒక దీపం కావాలి. అందుకోసమే శ్రీకృష్ణుని నీవు అవతరింప చేశావు. ఆ స్వామి ముఖం నుండి భగవద్గీత అనే దివ్యసూక్తి అవతరించేటట్లు చేశావు. ఆ గీత ఒక అత్యద్భుతమైన దీపంగా వెలుగుతున్నది. గొప్ప భవనంలో దీపాన్ని వెలిగించి పెడితే, ఆ భవనం అందాన్ని పొందడంతో పాటు, అందులో నాలుగు వైపులా ఉండే చీకటి అంతా తొలగిపోయి, వెలుతురు అంతటా ప్రసరిస్తుంది. వేదం ఒక పెద్ద భవనం. అందులో వెలిగించి పెట్టిన దీపమే భగవద్గీత. వేదంలో వివరింపబడి ఉండే అర్థాలు అన్ని గీత వల్ల స్పష్టంగా ప్రకాశిస్తున్నాయి. ఇంతేకాక, వేదంలో భగవంతుడు నిత్యవాసం చేస్తున్నాడు. అతనినిసే వేదం అంతా కీర్తిస్తున్నది. ఆ స్వామిని కూడా స్పష్టంగా చూపుతున్నది. , ఈ గీత అనే దీపం. పండితులు అందరూ ఏకముఖంగా ఈ గీతాశాస్త్రాన్ని కీర్తిస్తున్నారు. గీతలోనే కదా చరమ శ్లోకం శిఖరంగా వెలుగుతున్నది. ఈ శ్లోకం వల్ల కదా ప్రపత్తిని స్పష్టంగా తెలుసుకొని దానిని ఆచరించడానికి జనులకు అవకాశం కలుగుతున్నది. ఈ విధంగా ఏనాడూ నశించని గీత అనే ఒక అఖండ దీపాన్ని వెలిగించి, లోకంలో ఉండే అజ్ఞానం అనే చీకటిని పోగొట్టడంకోసమే నీవు శ్రీనివాసుని శ్రీకృష్ణునిగా అవతరింపజేశావు.

*90) వృషాద్రిహయసాదినః ప్రబలదోర్మరుత్ప్రేక్షితః*

*త్విషా స్ఫుటతటిద్గుణ స్త్వదవసేకసంస్కారవాన్ /*

*కరిష్యతి దయే కలిప్రబలఘర్మనిర్మూలనః*

*పునః కృతయుగాంకురం భువి కృపాణధారాధరః ॥*

దయాదేవీ! భగవంతుని పది అవతారాలలో కల్కి అవతారమే చివరిది. ఈ అవతారం ఈ కలియుగంలో చివరిలో రాబోతున్నది. ఈ అవతారాన్ని కూడా ఎత్తేటట్లు భగవంతుని నీవే ప్రేరేపిస్తున్నావు. కలియుగం చివరిలో పాపం ఎక్కువగా చేసిన జనులే ఎక్కువగా ఉంటారు కదా. అప్పుడు కల్కి గుర్రపు ముఖాన్ని కలవాడై, తెల్లని గుర్రాన్ని ఎక్కి, చేతిలో కత్తిని ధరించి వస్తాడు ఆ కత్తితో కలియుగం చివరిలో ఉండే దుష్టులను అందరినీ సంహరించి, కలియుగాన్ని ముగిసిన తరువాత ధర్మమే మిక్కిలిగా ఉండే కృతయుగాన్ని ఆరంభింప చేస్తాడు. అతడు చేతిలో పట్టుకునే కత్తి ఎవరంటే, దయాదేవివి అయిన నీవే. నీ సంబంధం కత్తికి నూనెను రాసినట్లుగా అవుతున్నది. నూనెను రాయకపోతే కత్తి చక్కగా పనిచేయదు. కల్కి ధరించిన కత్తిలో నీవు అనుప్రవేశించకపోతే దుష్టులను దండించి, మంచి గతిని పొందించడం సాధ్యం కాదు. కల్కి ధరించిన ఆ కత్తి ఒక మేఘంవంటిది. ఆ కత్తి నీతో కలవడం మేఘం నీటిని తాగడంవంటిది అవుతున్నది. కల్కి యొక్క చేయి ఒక గాలివంటిది. గాలి మేఘాన్ని ప్రేరేపించేటట్లే, చేయికదా కత్తిని వీస్తుంది. చేతిలో ఉండే కత్తి కదిలేటప్పుడు కత్తి ప్రకాశం పలు దిశలలో ప్రసరించి మెరపులు మెరసినట్లు తోస్తుంది. కల్కి చేతిలోని ఆ కత్తి అనే మేఘం కరుణావర్షాన్ని

వర్షిస్తుంది. ఆ కత్తి చేత వధింపబడినవారు అందరూ తిరిగి పాపాలను చేయకుండా, మంచి గతిని పొందుతారు. ఈ విధంగా దుష్టులను నశింప చేయడంవల్ల కలియుగం అనే గ్రీష్మకాలంచేత ఏర్పడే సకల తాపాలు తీరిపోతాయి. ఈ విధంగా ఆ కత్తి కలియుగాన్ని నశింప చేయడంవల్ల తిరిగి భూమిలో కృతయుగం ఆరంభం అవుతుంది. ఆ యుగంలో ధర్మం చక్కగా తిరిగి అంకురించి, వృద్ధి చెందుతుంది. ఈ విధంగా శ్రీనివాసుని కల్కి రూపంలో అవతరింప చేసి, ఇంతటి కార్యాలను నీవే కలియుగం చివరిలో చేయబోతున్నావు.

***91) విశ్వోపకారమితి నామ సదా దుహానాం***
***అద్యాపి దేవి భవతీ మవధీరయంతమ్ /***
***నాథే నివేశయ వృషాద్రిపతే ర్దయే త్వం***
***న్యస్తస్వరక్షణభరం త్వయి మాం త్వయైవ //***

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! ఇంతవరకు నేను విజ్ఞాపన చేసినట్లుగా, ఎల్లప్పుడూ పలు విధాలుగా లోకాలకు ఉపకారాలను నీవు అనుగ్రహిస్తూనే ఉన్నావు. ఆ గొప్పతనాన్ని నేను కొంచెం తెలిసికొని నీదగ్గర నన్ను రక్షించే బాధ్యతను సమర్పించి వేశాను. ఈ భరన్యాసాన్ని చేయడంలో కూడా దాసునకు పూర్తిగా స్వాతంత్ర్యం లేదు. నీవే నన్ను పురస్కరించుకొని భరన్యాసాన్ని చేయించి, నన్ను రక్షించే బాధ్యతను స్వీకరించావు. అయితే, దీనికి తరువాతకూడా నిన్ను కాదని నేను ప్రవర్తిస్తున్నాను. నీ మనసుకు వ్యతిరేకంగా అనేక అపచారాలను చేస్తూనే

ఉన్నాను. నీ విషయంలో భరన్యాసం చేసిన తరువాత కూడా, నేను పాపాలను చేయడం నిన్ను అవమానించినట్లుగానే అవుతున్నది. ఈ అపచారాలను సహించి, తరువాత కూడా అపచారలను చేయకుండా ఉండి, శ్రీనివాసుడై అవతరించిన శ్రీవైకుంఠనాథుని శ్రీచరణాలలో శాశ్వతకైంకర్యాన్ని చేసేటట్లు నన్ను నీవు చేయాలి.

***92) నైసర్గికేణ తరసా కరుణే నియుక్తా***
***నిమ్నే తరేఽపి మయి తే వితతిర్యది స్యాత్ |***
***విస్మాపయేద్వృషగిరీశ్వర మప్యవార్యా***
***వేలాతిలంఘనదశేవ మహాంబురాశేః ॥***

దయాదేవీ! భక్తుల దగ్గరకు వెళ్ళడంలో నీకు వేగం సహజంగానే ఏర్పడింది. ఆ వేగం నీ ప్రవాహాన్ని మిక్కిలిగా ప్రవహింప చేస్తుంది. అందువల్ల ఈ ప్రవాహాన్ని అడ్డు పెట్టడం ఎవరికి సాధ్యం కానందున, అది అన్ని చోట్లకు ప్రవహిస్తుంది. దాసుడు ఒక మిట్టగా ఉండే చోటువంటివాడు. నీ దగ్గర భరన్యాసం చేసిన తరువాత కూడా, ఈ శరీర సంబంధం కారణంగా అనేక అపచారాలను చేస్తున్నాను. చాలా పెద్దది. అయిన, నేను అహంకారం నిండుగా కలిగినవాడను. అందుచేత, నీ ప్రవాహం ప్రవహించడానికి యోగ్యత లేని మిట్టగా ఉండే చోటువంటివాడనై ఉన్నాను. అయినప్పటికీ, ఎవరివల్ల అడ్డు పెట్టడానికి సాధ్యం కాని నీ ప్రవాహం నాపై తప్పక ప్రవహిస్తుంది. నా పాపాలను ఏదైనా ప్రాయశ్చిత్తంతో పోగొట్టి, నన్ను పవిత్రునిగా చేసి, మోక్షానందాన్ని

ఇవ్వడానికి నీ ప్రవాహం ముందుకు వస్తుంది. ఈ విధంగా నీ ప్రవాహం చేసే కార్యాన్ని నీ నాయకుడు శ్రీవేంకటాద్రి శిఖరంపై నిలచి ఉండి, చూస్తున్నాడు. అతడు పొందే ఆశ్చర్యానికి అంతు లేదు. ప్రళయకాలంలో మహాసముద్రంలోని ప్రవాహం అడ్డు పెట్టడానికి ఎవరికి సాధ్యం కాకుండా ఉండేదై మిట్టపల్లాలు అనే తేడా లేకుండా, అంతటా ప్రవహించి ముంచేటట్లు ఉండే ఈ స్థితిని చూసి చాలా ఆశ్చర్యాన్ని పొందుతున్నాడు. ఈ విధంగా అతనిని చాలా ఆశ్చర్యపడేటట్లు చేసిన నీ గొప్పతనాన్ని నేను ఏమని పొగడగలను?

*93) విజ్ఞాతశాసనగతి ర్విపరీతవృత్త్యా*
*వృత్రాదిభిః పరిచితాం పదవీం భజామి /*
*ఏవంవిధే వృషగిరీశదయే మయి త్వం*
*దీనే విభోః శమయ దండధరత్వలీలామ్ //*

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! భగవంతుని ఆజ్ఞ అనే శాస్త్రాలు చేయవలసిన కర్తవ్యాలను, చేయకూడని పనులను వివరించి, వీటిలో, చేయవలసినవానిని చేసినందులకు, చేయకూడనివానిని చేసినందుకు ఏర్పడే దండనలను వివరించి తెలుపుతున్నాయి. ఈ విషయాలను నేను తెలిసినవాడనే, తెలిసి కూడా శాస్త్రాలకు వ్యతిరేకంగా ఉండే దారిలోనే నడుస్తున్నాను. భగవంతునకు శత్రువులైన వృత్రాసురుడు, హిరణ్యకశిపుడు శిశుపాలుడు మొదలైన దుష్టులు ఆచరించి అలవాటు పడిన దారిలోనే నేను కూడా నడుస్తున్నాను. శాస్త్రాలను తెలియకుండా

పాపం చేసినవారి కంటే, శాస్త్రాలను తెలిసి పాపం చేసినవారికి దండన అధికం అనేదానిని కూడా నేను తెలిసికొన్నవాడనే. అయినప్పటికీ, చెడ్డదారిలోనే నడుస్తున్న నన్ను ప్రభువైన భగవంతుడు నిశ్చయంగా దండించడానికి ముందుకు వస్తాడు. చేతనుల కర్మకు తగినట్లు అతడు ఫలాలను ఇచ్చి తీరాలి కదా. అయినా, నీ విషయంలో ప్రాయశ్చిత్తంగా ప్రపత్తి చేయడాన్ని పురస్కరించుకొని, నీవు స్వామి దగ్గర నా గూర్చి అనుకూలంగా మాట్లాడాలి. అతడు నా విషయంలో దండన అనే క్రీడను చేయకుండా ఉండేటట్లు చేసి రక్షించాలి. ప్రపత్తికి తరువాత తెలిసి చేసే పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఒక ప్రపత్తి చేస్తే, ఆ పాపాలు తొలగిపోతాయి అని, వాటికి దండన లేదని శాస్త్రాలు చెబుతున్నాయి కదా.

***94) మా సాహసోక్తిఘనకంచుకవంచితాన్యః***
***పశ్యత్సు తేషు విదధామ్యతిసాహసాని /***
***పద్మాసహాయకరుణే న రుణత్సి కిం త్వం***
***ఘోరం కులింగశకునే రివ చేష్టితం మే //***

శ్రీనివాసుని దయాదేవీ! ఇతర మానవులను చూచి "శాస్త్రాలకు వ్యతిరేకమైన కార్యాలను చేయకండి. వానిని చేయడం అపరాధకార్యం" అని ఉపదేశం చేస్తున్నాను. వారికి ఈ విధంగా ఉపదేశించి, నేను చేసేది ఏమి? వారి కంటి ఎదురుగానే, ఏ విధమైన సంకోచం, సిగ్గు లేకుండా, అనేక విధాలైన పాపాలను చేస్తున్నాను. ఇది చాలా భయంకరమైన పని కదా. ఇతరులకు ఉపదేశం అనే దృఢమైన కవచాన్ని ధరించి, ఇతరులను

వంచించి, నేనే నా ఉపదేశానికి మారుగా, తప్పుగా ఉండే దారిలో నడుస్తున్నాను. ఈ విధంగా నేను చేయడం కులింగ అనే పక్షి చేసే కార్యంవలె అవుతున్నది. అది, ఇతర పక్షులకు "ప్రమాదాన్ని కలిగించే కార్యాన్ని చేయవద్దు" అని చెబుతూనే ఉంటుంది. అయితే ఆ పక్షి ఏమి చేస్తుంది? అంటే, సింహం నిద్రపోయి ఆవులించేటప్పుడు, దాని నోటిలో ప్రవేశించి అక్కడ ఉండే మాంసాన్ని కొరికి గ్రహించాలని ప్రయత్నిస్తుంది. ఇటువంటి భయంకరమైన కార్యమే నేను చేసే పని కూడా, ఈ విధంగా, చెప్పే మాటకు, చేసే పనికి సంబంధం లేకుండా పరస్పరం వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ ఉండే నన్ను, ఆ విధంగా చేయకుండా అడ్డుపెట్టే బాధ్యత నీదే కదా. ఎందుకు నన్ను అడ్డుపెట్టకుండా చూస్తూనే ఉన్నావు? ఇక, నేను ఆ విధంగా చేయకుండా అడ్డుపెట్టి, నీవు నన్ను మంచి గతిని పొందించాలి.

*95) విక్షేప మర్హసి దయే విఫలాయితేఽపి*
*వ్యాజం విభావ్య వృషశైలపతే ర్విహారమ్ |*
*స్వాధీనసత్త్వసరణిః స్వయ మత్ర జంతౌ*
*ద్రాఘీయసీ దృఢతరా గుణవాగురా త్వమ్ ॥*

దయాదేవీ! నీవు ఒక వలవలె అయినదానివై, నాపై ప్రసరించి, నన్ను పట్టుకుని శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో పడవేయాలి. లోకంలో ప్రభువులు వేటను ఆడడం కోసం అరణ్యాలకు వెడతారు. అక్కడ ఏనుగులు మొదలైన జంతువులను, చంపకుండా, వలను విసరి, అందులో వాటిని పడేటట్లు చేస్తారు. తమను బంధించడానికి రావడాన్ని

గమనించి మృగాలు చాలా దూరం పరిగెత్తుకుని పోతాయి. ఆ విధంగా అవి తప్పుకొని పారిపోకుండా ఉండడానికి తగినట్లుగా, పెద్ద
ఆ వల పెద్దదిగా చాలా పొడుగుగా ఉంటుంది. ఆ వల గట్టిగా ఉండే దారాలతో దృఢంగా కట్టబడి ఉంటుంది. అందులో వచ్చి పడే మృగాలు తప్పుకొని పారిపోకుండా ఉండేటట్లు వల్ల చాలా బలంగా ఉంటుంది. ఆ విధంగా పట్టుకున్న ఆ మృగాలను ప్రభువులు తమ నగరాలకు తీసుకొని పోయి, మంచి ఆహారాన్ని పెట్టి, పెంచి వాటితో ఆటలాడుకుంటూ ఉల్లాసంగా కాలాన్ని గడుపుతారు. దయాదేవీ! నేను ఒక మృగంవంటివాడను. నీవు నా దగ్గరకు రాని విధంగా, అనేక విధాలయిన పాపాలను చేస్తూ నీకు లౌకిక సుఖాలను అన్వేషిస్తూ పరుగులు తీస్తున్నాను. నాకు సత్వగుణం తల ఎత్తే విధంగా చేసి, నన్ను మంచిదారికి తెచ్చే సామర్థ్యం నీకే ఉన్నది. ఇష్టం వచ్చినట్టుగా తిరిగే నేను ఉండే చోటకు, నీవు శ్రీవేంకటేశ్వరునకు వినోద క్రీడ అనే ఒక ఆభాస కారణాన్ని నీవే కల్పించి, మెల్లిగా తీసుకొని అతనిని రావాలి. అతడు నన్ను పట్టుకోవడానికి అనువుగా నీవు అమరాలి. నీ కటాక్షానికి చిక్కుకోకుండా, లౌకిక భోగాలలోనే మునిగి ఉండి తిరిగే చేతనలను బంధించి తనలో చిక్కుకొనే విధంగా, అంతటి పెద్ద వలగా ఉండడానికి తగినదానవు నీవే. వారు ఇటువంటి పాపాలు చేసి, నిన్ను విడిచి దూరంగా పోవాలని ప్రయత్నం చేసినా, వారిని చేయి విడవకుండా, దృఢంగా పట్టుకునే దానవు నీవే. ఈ విధంగా నీవు ఒక వలపై ఉండి, నన్ను పట్టుకొని శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో చేర్చి, అతనిని

అనుభవించే భోగంలో మునిగి ఉండేటట్టు చేయాలి. ఈ విదంగా మంచి దారిలో పడిన నన్ను చూసి శ్రీనివాసుడు కూడా ఆనందించాలి. నాకు ఇంతటి హితాలను నీవు అనుగ్రహించాలి.

*96) సంతన్యమాన మపరాధగణం విచింత్య*
*త్రస్యామి హంత భవతీం చ విభావయామి /*
*అహ్నాయ మే వృషగిరీశదయే జహీమామ్*
*ఆశీవిషగ్రహణకేళినిభా మవస్థామ్ ॥*

శ్రీనివాసుని దయాదేవీ! మోక్షం కోసం భరన్యాసం చేసిన తరువాతకూడా, బాగా తెలిసే పలు విధాలైన పాపాలను నిరంతరంగా నేను చేస్తున్నాను. "దీనికి క్రూరమైన ఫలాలు కలుగుతాయే! " అనే భయం నాకు ఉన్నది. ఈ పాపాలను పోగొట్టుకోవడానికి నిన్ను భావించి, నీ దగ్గర ప్రాయశ్చిత్త ప్రపత్తిని చేస్తున్నాను. నా పాపాలను పోగొట్టే నీ గొప్పతనాన్ని భావిస్తున్నాను. ఈ విధంగానే పాపాలను చేయడం, వాటి కోసం ప్రాయశ్చిత్త ప్రపత్తిని చేయడం అనే ఈ విధంగానే కాలాన్ని గడుపుతున్నాను. ఇది అద్భుతమైన, ఒక అవివేక కార్యం అవుతున్నది. పాములను ఆడించేవాడు క్రూరమైన విషాన్ని కలిగిన సర్పాలతో ఆడడంవంటిది, ఈ కార్యం. పాములను పట్టుకొని పాములవాడు వాటితో ఆడేటప్పుడు, అవి అతనిని కరచివేస్తాయి. అతడు మంత్రం, వేరు మొదలైనవాటితో విషాన్ని పోగొట్టుకుంటాడు. మళ్ళీ, పాములవాడు వాటితో ఆడుతుంటాడు. మళ్ళీ అవి అతనిని కరుస్తాయి. అతడు కూడా

మళ్ళీ దానికి పరిహారం చేసికొంటాడు. ఈ విధంగానే అతని జీవితం నడుస్తుంది. ఇదే విధంగా, నేను కూడా పాపం చేయడం, ప్రాయశ్చితాన్ని చేసుకోవడం అనే విధంగానే కాలాన్ని గడుపుతున్నాను. ఈ స్థితి నాకు పోయి ఇక పాపం చేయని విధంగా నన్ను నీవు చేసి రక్షించాలి.

*97) ఔత్సుక్యపూర్వ ముపహృత్య మహాపరాధాన్*
*మాతః ప్రసాదయితు మిచ్ఛతి మే మన స్త్వామ్ /*
*ఆలిహ్య తాన్ నిరవశేష మలబ్ధతృప్తిః*
*తామ్యస్యహో వృషగిరీశధృతా దయే త్వమ్ ॥*

దయాదేవీ! నీవు నాకు తల్లివి. నీకు కుమారుడను అయిన నేను నీకు పరిపూర్ణమైన ఆహారాన్ని ఇచ్చి పూర్ణమైన తృప్తిని కలిగించాలని ఆశపడుతున్నాను. నేను నీకు ఇవ్వదగిన ఆహారం నా దగ్గర ఉండే గొప్ప గొప్ప పాపాలే. వాటిని అన్నిటిని నీకు కానుక వలె తీసుకుని వచ్చి సమర్పించాను. వాటిని అన్నిటిని కొంచెం కూడా మిగల్చకుండా బాగా నీవు స్వీకరించావు. వాటిని అన్నిటినీ భుజించిన తరువాత కూడా నీకు చాలు అనే భావం కలుగలేదే! ఏమీ భుజించకుండా ఉపవాసంతో ఉన్నట్లుగా వాడి ఉన్నావే! శ్రీవేంకటేశ్వరుడు గొప్ప ఆదరాన్ని కలవాడై, నిన్ను విడవకుండా ఉండేటట్లు ఎల్లప్పుడూ ధరించి ఉన్నాడు. పెద్ద చోట సంబంధం కలిగి ఉన్నా, ఆకలి తీరకుండా వాడి ఉన్నావే! ఇది ఏమి ఆశ్చర్యం?

దీని భావం ఏమంటే– మోక్షాన్ని పొందాలనే ఆశతో పాపాలను పోగొట్టుకొని పోవాలని కోరి, నిన్ను ఆనందింపజేసే ప్రపత్తిని నేను చేశాను. నీవు నా పాపాలను అన్నిటినీ కొంచెం కూడా మిగలకుండా నశింప చేశావు. ఇంతటితో విడవకుండా, ప్రపత్తికి తరువాత చేసి పాపాలను కూడా ప్రాయశ్చిత్త ప్రపత్తి మొదలైనవాటితో పోగొట్టాలని ముందుకు వస్తున్నావు. ఇది మాత్రమేనా! ఇంకా నా దగ్గర ఎన్ని పాపాలు గుట్టలు గుట్టలుగా ఉన్నప్పటి, కీ నీవు వాటిని పోగొట్టడానికి సిద్ధపడుతున్నావు. నేను చేసిన సులభమైన ఉపాయమైన ప్రపత్తిని చాలా గొప్ప ఉపాయంగా భావించి, నీవు చేసిన గొప్ప సహాయాలను చాలా తక్కువగా భావిస్తున్నావు. అందువల్ల "నేను చేసిన పనికి తగిన ప్రచుపకారం చేయలేదు" అని మనసులో బాధపడుతున్నావు. ఏమి నీ మనసులోని గొప్పతనం! ఆహా!

*98) జహ్యాద్వృషాచలపతిః ప్రతిఘేఽ పి న త్వాం*
*ఘర్మే పతప్త ఇవ శీతళతా ముదన్వాన్ /*
*సా మామరుంతుదభరన్యసనానువృత్తిః*
*తద్వీక్షణైః స్పృశ దయే తవ కేళిపద్మైః ॥*

దయాదేవీ! గ్రీష్మకాలంలో చాలా వేడిగా ఉండే ఎండలో సముద్రంలోని మీరు ఉప్పొంగి, పైకి వస్తుంది. అయినా, నీటికీ సహజంగా ఉండే చల్లదనం దానిని విడచి ఏ సమయంలోనూ తొలగిపోదు. అయితే అది బయట తెలియకుండా లోపల ఉండే ఉంటుంది. ఆ విధంగానే,

ప్రపత్తిని చేసిన తరువాత, తెలిసి కొన్ని పాపాలను చేసినప్పుడు, వారిపై శ్రీవేంకటేశ్వరుని మనసులో తాత్కాలికంగా కోపం వస్తుంది. అయినా, శ్రీనివాసుడు కరుణ అనే నిన్ను ఏనాడు విడచి ఉండడం సాధ్యం కాదు. ఆ విధంగా అతడు కోపంతో ఉంటే, నీవు కొంచెం మరుగుపడి ఉంటావు. అతడు వారికి అల్పమైన దండలను ఇచ్చేటట్లు చేయడం కాని, లేక, వారి ప్రాయశ్చిత్త ప్రపత్తిని చేసేటట్టు చేయడం కానీ చేసి, వారి ప్రపత్తితో అతని కోపాన్ని పోగొట్టేటట్లు చేస్తావు. వెంటనే మరగు పడి ఉండే నీవు బయటకు వచ్చి నిలుస్తావు. మోక్షంకోసం ఒకసారి భరన్యాసంచేసినవాడు మళ్ళీ ఒక పర్యాయం కానీ, అనేక పర్యాయాలు కానీ అదే ప్రయోజనం కోసం భరన్యాసం చేయడం మాత్రం నీవు సహించలేవు. అందువల్ల నీ మనసు చాలా నొచ్చుకుంటుంది. ఈ విధంగా గంభీరమైన మనసును కల నీవు శ్రీనివాసుని కటాక్షాలు నాపై పడేటట్లు చేయాలి. ఇది నీకు అరుదైన పని కాదు. ఆ కటాక్షాలు నీ చేతిలో పట్టుకొనే లీలా పద్మంవలె నీకు వశపడి చల్లగా ఉన్నాయి. ఆ కటాక్షాలతో నా శరీరాన్ని, మనస్సును తాపం తీరేటట్టుగా తడవుతూ అనుగ్రహించాలి.

***99) దృష్టేఽపి దుర్బలధియం దమనేఽపి దృప్తం***
***స్నాత్వాఽపి ధూళిరసికం భజనేఽపి భీమమ్ /***
***బద్ధ్వా గృహాణ వృషశైలపతే ర్దయే మాం***
***త్వద్వారణం స్వయమనుగ్రహశృంఖలాభిః //***

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! లోకంలో ఒక్కొక్క సమయంలో ఏనుగుకు మదం ఎక్కుతుంది. ఆ స్థితిలో అది చేసే పనులు చాలా అధికంగా ఉంటాయి. తనకు ఎదురుగా ఉంచిన ఆహార పదార్థాన్ని చూసి కూడా, దానివల్ల తనకు కలిగే మంచిని తెలియకుండా దానిని ముట్టుకోకుండా మనసులో కలతను పొంది ఉంటుంది. మావటివాడు దానిని అంకుశంతో కొట్టి అణచాలని ప్రయత్నించినా, అది లెక్కపెట్టకుండా, మదంతో ఉంటుంది. దాని శరీరంలో ఉండే మురికిని పోగొట్టడంకోసం మావటివాడు దానిని నీటిలో స్నానాన్ని చేయించిన తరువాత కూడా, బురదను తన పైన చల్లుకోవడానికి ప్రయత్నిస్తుంది. తనకు అలవాటు పడిన మావటివాడు దగ్గరకు వచ్చి తీయని మాటలను పలికి, ఆహార పదార్థాలను ఇచ్చి, దారికి తీసుకొని రావాలని ప్రయత్నం చేసినా, అతనికి హాని కలిగించాలని ప్రయత్నించి, భయంకరంగా ఘీంకకరిస్తూ నిలుస్తుంది. ఈ ఏనుగును పెద్ద పెద్ద సంకెళ్ళలతో బంధించి కట్టి నియంత్రించడమే చేయవలసిన పని. దయాదేవీ! నీ దగ్గర భరన్యాసం చేసిన నేను నీవాడను. మదం ఎక్కి, పట్టుకోవడానికి సాధ్యం కాకుండా ఉండే ఏనుగువలె ఉండే నేను, శాస్త్రాలతో మంచి చెడ్డలను మంచి చెడ్డలను చక్కగా తెలుసుకుంటున్నాను. అయితే, శాస్త్ర క్రమంలో నడవడానికి వీలు లేని రీతిలో మనసులో కలతను పొంది ఉన్నాను. నేను చేసే పాపాలకు కొన్ని దండనలను పొందినప్పటికీ, ఇక పాపమే చేయకూడదు అనే నిశ్చయం లేనివాడనై, మదంతో ఉన్నాను. కొందరు పెద్దలు నా దగ్గరకు వచ్చి మంచి మాటలు చెప్పినప్పటికీ, తాత్కాలికంగా

కొంచెం మారి, చేసిన పాపాలకు ఏదైనా ప్రాయశ్చిత్తం చేసినా, పూర్వపు వాసన చేత మళ్లీ పాపాన్ని చేయడంలోనే ఆసక్తిని పొందుతున్నాను. ఈ విధంగా నేను కొంచెం మారినా, మళ్లీ దారి తప్పి నడవడానికి చూచి, కరుణను పొందిన కొందరు సాధువులు నన్ను సంస్కరించాలని వచ్చినా, కటువైన మాటలతో కఠినంగా పలికి, వారు నా దగ్గరకు రావడానికి భయపడే విధంగా చేస్తున్నాను. ఈ విధంగా మొరటు ఏనుగువలె ఉండే నన్ను నీ అనుగ్రహాలు అనే సంకెళ్లతో బంధించి, నీవుగానే నన్ను వశపరచుకుని, నాకు జ్ఞానాన్ని, భక్తిని పెంచి రక్షించాలి.

వారణం అనే పదానికి ఏనుగు అని, వారించడం అని రెండు అర్థాలు ఉన్నాయి. మదపుటేనుగు తన మావటివానిని తనను కట్టడానికి వీలు లేకుండా అడ్డుపడడం ద అనే భావం, చేతనుడను అయిన నేను శాస్త్రాన్ని మీరడం మొదలైనవాటిచేత భగవంతుని దయ నా దగ్గరకు రాకుండా అడ్డుపడేవాడను— అనే అర్థం పొసగి ఉండే స్వారస్యాన్ని ఇక్కడ గమనించాలి.

***100) నాతః పరం కిమపి మే త్వయి నాథనీయం***
***మాత ర్దయే మయి కురుష్వ తథా ప్రసాదమ్ /***
***బద్ధాదరో వృషగిరిప్రణయీ యథా సౌ***
***ముక్తానుభూతి మిహ దాస్యతి మే ముకుందః //***

లోకానికి అంతటికి తల్లిపై ప్రకాశించే దయాదేవీ! సంసార సముద్రంలో మునిగి పడి ఉండి, ఇంకా ఇంకా భోగాలలోనే ఆసక్తిని కలిగి

ఉండేవాడను అయిన నాకు మంచి జ్ఞానం ఇచ్చావు. మోక్షంలో ఆశను పొందేటట్లు చేశావు. నీ శ్రీచరణాలలో అందుకోసం భరన్యాసం చేసేటట్లు చేశావు. నేను ఈ శరీరం చివర మోక్షాన్ని పొందడంలో ఏ విధమైన సందేహం లేదు. మోక్షం కోసం ఇక నేను చేయవలసినది ఏమీ లేదు. నీ దగ్గర ఇప్పుడు నేను ప్రార్థించవలసినది ఒక్కటే ఉన్నది. అది ఏమంటే, చేతనులను ఉజ్జీవింపచేయడం కోసమే పరమపదంనుండి తిరుమల మీదకు కోరి వచ్చి అవతరించినవాడు, శ్రీనివాసుడు. అతడే ఇహలోక భోగాలను, మోక్షాన్ని ఇవ్వగలిగినవాడు. అతనికి దాసుని విషయంలో ఆదరం వృద్ధి చెందాలి. అతడు మోక్షంలో ముక్తులకు ఇచ్చే అనుభవాన్ని ఇక్కడ తన శ్రీచరణాలలో దాసుడైన నాకు అనుగ్రహించాలి. నీవే ముందు నిలచి, దీనిని చేయించాలి. నీవు మనస్సు పెడితేనే, ఈ అనుభవాన్ని ఇక్కడ నేను పొందడానికి వీలవుతుంది. ఇది తప్ప, ఇంతకంటే మించినదై ఉండే ఏ విషయాన్ని నీ దగ్గర నేను ప్రార్థించ వలసినది లేదు. ఈ అనుగ్రహాన్ని నీవు చేయాలి.

***101) నిఃసీమవైభవజుషాం మిషతాం గుణానాం***

***స్తోతు ర్దయే వృషగిరీశగుణేశ్వరీం త్వామ్ /***

***తై రేవ నూనమవశైరభినందితం మే***

***సత్యాపితం తవ బలాదకుతోభయత్వమ్ //***

దయాదేవీ! శ్రీవేంకటేశ్వరునకు జ్ఞానం, బలం, వీర్యం, శక్తి మొదలైన అనేక గుణాలు ఉన్నాయి. ఆ గుణాలు కూడా అవధి లేని గొప్పతనాన్ని కలిగి ఉన్నవే. నిన్ను నేను స్తుతించేటప్పుడు ఆ గుణాలు

తమ కళ్ళను తెరిచి చూస్తూనే ఉన్నాయి. అయినా, ఈ స్తోత్రంలో వాటిని గూర్చి కీర్తిస్తూ పలుకకుండా, విడచిపెట్టి నిన్నే నేను స్తుతించాను. ఎందుకు? భగవంతుని ఆ అంతు లేని గుణాలలో నీవే ప్రధానమైన దానవై ఉన్నావు. అతని భక్తులకు నీవు చేసే సహాయం మిగిలిన గుణాల వల్ల చేయడం సాధ్యం కాదు. నీవు లేకపోతే, అవి ఉన్నప్పటికీ లేనివే అవుతాయి. దీనిని భావించే, నేను మిగిలిన గుణాలను విడచి, నిన్ను స్తుతించాను. ఇందువల్ల ఆ గుణాలకు నా విషయంలో కోపం కలగడం, వాటి వల్ల నాకు భయం కలగడం సహజమే. అయితే, నీ బలం సహాయంగా ఉన్నందున, నాకు ఎవరి వల్ల భయం అనేది కలగడం లేదు. ఇప్పుడు వాస్తవమైన స్థితి వేరు. ఆ గుణాలకు నాపై కొంచెం కూడా కోపం లేదు. ఎందుకు? అంటే, తమకు నీవే నాయకురాలివి– అని, నీవు లేకపోతే చేతనులకు తాము ఉపయోగపడడం సాధ్యం కాదని, నీవే తమకు మొదటి కారణమని అవి చక్కగా తెలుసుకున్నాయి. అందుచేత వేరుక నీరు పోస్తే పై భాగంలో వృద్ధి చెందినట్లుగా, నిన్ను నేను స్తుతించడమే తమకు చేసిన సేవగా అవి భావించాయి. నేను దేనికి భయపడకుండా నిన్నే స్తుతించడాన్ని చూచి, ఆ గుణాలు పరవశమై, ముఖం చల్లబడి వికసించి శిరస్సును ఊగించాయి. నా ధైర్యాన్ని ప్రశంసించాయి. లోకంలో కూడా తమ రాణిని ఎవరైనా పొగడితే, అభిజనులు ఆనందించడం సహజమే. ఆ గుణాలు ప్రశంసించడం వల్ల నాకు భయం లేకపోవడం అనేది ఋజువు చేయబడింది.

*102) అద్యాపి తద్వృషగిరీశదయే భవత్యామ్*

*ఆరంభమాత్ర మనిదంప్రథమస్తుతీనామ్ ।*

*సందర్శితస్వపరనిర్వహణా సహేథాః*

*మందస్య సాహసమిదం త్వయి వందినో మే ॥*

శ్రీవేంకటేశ్వరుని దయాదేవీ! వేదాలు నిన్ను స్తుతించడం ఈనాడా ఆరంభించాయి! లేదు కదా. అనాదికాలంగానే నీ గొప్పతనాన్ని చెప్పడానికి ముందుకు వచ్చాయి. ఈ ప్రయత్నంలో కొంచెం దూరం కూడా ముందుకు వెళ్ళలేక, ఈ నాటికీ ప్రారంభించిన దశలోనే నిలచిపోయాయి. ఇటువంటి నిన్ను అల్ప జ్ఞానాన్ని కలవాడను అయిన నేను నూరు శ్లోకాలతో పరిమితం చేసి స్తుతించడాలనే భావన చేశాను. ఈ స్తోత్రాన్ని చదివేవారు కూడా నీ గొప్పతనాన్ని నూరు శ్లోకాలలో అంతర్భవించినది అని తప్పుగా భావించేటట్లుగా కదా నేను చేశాను. ఈ పని నన్ను మాత్రమే కాకుండా, ఇతరులను కూడా కదా పాడు చేయగలిగినదిగా ఉన్నది. ఇంతకంటే ఆ స్థితికి తగని హీనమైన కార్యం ఇంకొకటి ఉన్నదా? నీ విషయంలో పెద్ద అపచారాన్ని కదా చేసి వేశాను. భగవంతునకు నేను చేసే అపచారాలను అతడు క్షమించేటట్టుగా నీవే చేస్తున్నావు. నీ వద్దనే నేను చేసిన ఈ పెద్ద తప్పును నీవు క్షమించేటట్లు చేయాలని అన్వేషించడంలో వేరొక కరుణ ఉన్నదా? లేదే! అందుచేత, శ్రీనివాసుని మనసులో ప్రవేశించి నా దోషాలను క్షమింపచేసేటట్లే, నీ విషయంలో నేను చేసిన తప్పును కూడా నీవే కరుణపై నిలచి, క్షమించాలి, సహించాలి. ఈ రెండు విధాలయిన కార్యాలను చేయడానికి సామర్థ్యం నీకే ఉన్నది.

***103) ప్రాయో దయే త్వదనుభావమహాంబురాశౌ***
***ప్రాచేతసప్రభృతయోఽపి పరం తటస్థాః |***
***తత్రావతీర్ణ మతలస్పృశ మాప్లుతం మాం***
***పద్మా పతేః ప్రహసనోచిత మాద్రియేథాః ॥***

దయాదేవీ! వాల్మీకి, వ్యాసుడు మొదలైన మహర్షులు తమ ఇతిహాసాలతోనూ, పురాణాలతోనూ నీ గొప్పతనాన్ని పలకాలని ప్రయత్నించారు. నీ గొప్పతనాన్ని చూస్తే, అది మహా సముద్రంగా ఉన్నది. వారు ఆ సముద్రం దగ్గరకు వచ్చినవారైనా, లోపలకు ప్రవేశించటానికి భయపడి, తీరంలోనే నిలచిపోయారు. తమ పెద్ద పెద్ద గ్రంథాలలో నీ గొప్పతనాన్ని చిన్న తుంబురులను కూడా పూర్తిగా పలుక లేక నిలచిపోయారు. ఈ విధంగా మహర్షులనుకూడా తీరంపై నిలిచేటట్లు చేసిన నీ గొప్పతనం అనే సముద్రంలో అల్పుడనైన నేను ప్రయత్నం చేసి లోపలకు దిగాను. లోపల మునిగి, తీరాన్ని చేరాలని కోరాను. కానీ, ఇది సాధ్యమా? మునుగుతూ మునుగుతూ పైకి లేస్తున్నాను. నీ గొప్పతనంలోని చిన్న కణాన్ని కూడా వర్ణించడం నాకు సాధ్యం కాదు. కొన్ని పలుకులతో ఏదో చెప్పి చెప్పి తడబడుతున్నాను. మహర్షుల వలె నేను తీరంలోనే నేను కూడా నిలసిపోయి ఉండవచ్చు. కానీ, నేను తెలియకుండా, నా దశకు తగని పనిలో ప్రవేశించి తడబడి తపిస్తున్నాను. ఇటువంటి నేను ఏ విధమైన పేరు ప్రయోజనాన్ని సాధించలేకపోయినా,

నన్ను చూసి శ్రీవేంకటేశ్వరుడు లక్ష్మీదేవి నవ్వుకొని ఆనందించడానికి పనికి వచ్చాను. ఈ స్థితిని పొందిన నన్ను నీవే ఆదరించి అనుగ్రహించాలి.

*104) వేదాంతదేశికపదే వినివేశ్య బాలం*

*దేవో దయాశతకమేతదవాదయన్మామ్ ।*

*వైహారికేణ విధినా సమయే గృహీతం*

*వీణావిశేషమివ వేంకటశైలనాథః॥*

శ్రీవేంకటేశ్వరుని కరుణను గూర్చి రూపొందిన ఈ దయాశతకం అనే సూక్తిని నేను రచించడం లేదు. ఈ గ్రంథాన్ని రచించిన బాధ్యత అంతా శ్రీనివాసునికే చేరుతుంది. అతనికి ఎల్లప్పుడూ వినోదమైన ఆటలను ఆడడంలో ఆశ ఉంటుంది. నా సుకృతం పరిపక్వదశ పొందింది. ఆ సమయంలో నన్ను పురస్కరించుకొని ఒక క్రీడను చేయాలని శ్రీనివాసుడు భావించాడు. చిన్నవాడనైన నన్ను ఎత్తుకొని, వేదాంతాచార్యులు అనే పెద్ద స్థానంలో పెట్టాడు. అతడు లీలగా చేసిన ఈ పనిని యుక్తమైనదిగా చేయడం కూడా అతని బాధ్యత అయినది. వేదాంత తత్త్వాలను కలిగిన ఈ దయాశతకం అని గ్రంథాన్ని దాసుని నోటినుండి వెలువడేటట్టు చేశాడు. నన్ను సాధనంగా చేసుకుని ఈ దయా శతకాన్ని పాడాడు. లోకంలో ప్రభువై ఉండేవాడు వినోదంగా పొద్దు పుచ్చాలని అనుకొని, ఒక వీణను చేతిలో పెట్టుకొని, దాని తంత్రులను చేతితో మీటుతో దానినుండి తీయని ధ్వని వచ్చేటట్లు చేసి ఆనందించడం అనేది ఉన్నది. అక్కడ వీణ తీయగా పలకడానికి ఒక సాధనంగా

ఉంటుంది తప్పు, వీణయే స్వయంగా ఆ మధురమైన ధ్వనిని వెలువరించింది అని చెప్పడానికి వీలు లేదు కదా. ఆ వీణను వాయించేవాని సామర్థ్యాన్నే జనులు పొగడుతారు. ఈ విధంగా, ఈ గ్రంథం అవతరించడానికి నేను ఒక సాధనంగా కావడం అయ్యాను మాత్రమే. ఇందులోని గొప్పతనం అంతా నన్ను పురస్కరించుకొని ఈ గ్రంథాన్ని వెలువరించిన శ్రీవేంకటేశ్వరునిదే అవుతుంది. ఈ విధంగా ఒక లీలను శ్రీనివాసుడు చేశాడు.

శ్రీరంగనాథుడు వేంకటనాథుడు అనే పేరును కలిగిన ఈ ఆచార్యుని గొప్పతనాన్ని భావించి, వేదాంతాచార్యులు అనే బిరుదును ఇచ్చిన చరిత్రను మనసులో పెట్టుకొని ఈ విధంగా శ్లోకం రచింపబడింది.

*105) అనవధి మధికృత్య శ్రీనివాసానుకంపామ్*
*అవితథవిషయత్వాద్విశ్వమవ్రీడయంతీ /*
*వివిధకుశలనీవీ వేంకటేశప్రసూతా*
*స్తుతి రియ మనవద్యా శోభతే సత్త్వభాజామ్ //*

శ్రీనివాసుని కరుణ అంతు లేనిది. దానినిగూర్చి పలికినది, ఈ స్తోత్రం. ఇది శ్రీవేంకటేశ్వరునినుండే శ్రీవేంకటేశుడనే పేరు కలిగిన నా ద్వారా ఆవిర్భవించింది. ఈ స్తోత్రంలో ఉండే విషయాలు అన్ని నూటికి నూరు వాస్తవమైనవి. అందుచేత దీనిని గూర్చి ఎవ్వరూ సందేహపడవలసిన అవసరం లేదు. దీనిని రచించినవారు సిగ్గుపడవలసిన అవసరం లేదు. స్తుతింపబడే కరుణ కూడా తనను

అసత్యంగా, అబద్ధంగా స్తుతించినట్లు భావించి సిగ్గుపడవలసిన ఆవశ్యకత లేదు. దీనిని చదివేవారు, వినేవారు అసత్యాన్ని చదువుతున్నట్లుగాను, వింటున్నట్లుగాను భావించి సిగ్గుపడవలసిన అక్కరలేదు. ఈ స్తోత్రాన్ని అనుసంధించేవారికి ఇది సకల క్షేమాలను కలిగించగలిగినది ఈ విధంగా శబ్దదోషాలు, అర్థదోషాలు మొదలైన వాటిలో ఏదీ లేకుండా, ఉన్నతంగా వెలిగే ఈ స్తోత్రం సత్వగుణం తలఎత్తిన పెద్దల మనసును ఆనందించేటట్లు చేసి ప్రకాశిస్తున్నది.

నీవి అనే పదానికి వస్త్రంలోని ముడి– అని అర్థం. వస్త్రంలో వేసుకునే ముడి వస్త్రం జారిపోకుండా చేసి, ధరించినవారిని సిగ్గుపడవలసిన అవసరం లేకుండా చేస్తుంది.

***106) శతక మిదముదారం సమ్యగభ్యస్యమానాన్***
***వృషగిరిమధిరుహ్య వ్యక్తమాలోకయంతీ |***
***అనితరశరణానా మాధిరాజ్యే ఽభిషించేత్***
***శమితవిమతపక్షా శార్ఙ్గధన్వానుకంపా ॥***

ఈ స్తోత్రం అన్ని విధాలైన ప్రయోజనాలను ఇవ్వగలిగినది. దీనిని చక్కగా అభ్యసించి, అలవాటు పడినవారు నిశ్చయంగా ప్రపత్తిలోని గొప్పతనాన్ని చక్కగా తెలిసికొని, శ్రీవేంకటనాథుని శరణు పొందుతారు. వీరి పట్ల ఆనందాన్ని పొందిన ఇతని దయాదేవి తిరుమలపై అదిరోహించి, వీరిని చక్కగా, చల్లగా కటాక్షిస్తుంద. వీరు మంచి గతిని పొందడంలో అడ్డుగా ఉండే అన్ని విధాలైన పాపాలను శార్ ఙ్గం అనే విల్లును ధరించి

ఉండే తన నాథుని పురస్కరించుకొని నశించేటట్లు చేస్తుంది, కరుణాదేవి. కనుక నశింపచేసే ఈ కార్యాన్ని చేయకుండా తన నాయకుని విడచిపెట్టదు. తరువాత వీరిని, ప్రపత్తిని తప్ప ఇక ఏ ఉపాయాన్ని పరిగ్రహించని పరమై కాంతులు పొందే మోక్ష సామ్రాజ్యానికి అధిపతులుగా అభిషేకం చేస్తుంది, దయాదేవి. ఉన్నతమైన చోటు నుండి తన కటాక్షవర్షాన్ని కురిపించి, పట్టాభిషేకం చేయాలని భావించియే దయాదేవి పర్వతంపై అధిరోహించింది కాబోలు.

*107) విశ్వానుగ్రహమాతరం వ్యతిషజత్స్వర్గాపవర్గాం సుధా -*
*సధ్రీచీ మితి వేంకటేశ్వరకవి ర్భక్త్యా దయా మస్తుత |*
*పద్యానా మిహ యద్విధేయభగవత్సంకల్పకల్పద్రుమాత్*
*ఝుంఝామారుతధూతచూతనయతః సాంపాతికోఽయం క్రమః ॥*

శ్రీవేంకటేశ్వరుని దయా దేవి లోకాన్ని అంతటిని అనుగ్రహించే దయయై ఉన్నది సకల ప్రాణులు ఆమె సంతానం కదా. లోకంలో తల్లి తన బిడ్డలు కోరేటప్పుడు ఇవ్వడానికి పలు వస్తువులను తన దగ్గర పెట్టుకుంటుంది. ఆ విధంగానే, ఈ కరుణ అనే తల్లి చేతనులకోరికకు తగినట్లు అనుగ్రహించడం కోసం స్వర్గం, మోక్షం, అన్నిటినీ తన దగ్గర పెట్టుకునే ఉంటుంది. అందుచేత ఈమె భక్తులకు అమృతం వలె పరమ భోగ్యంగా ఉంటుంది. మిక్కిలి భక్తితో ఈ దయాదేవిని వేంకటేశకవి ఈ నురు శ్లోకాలతో స్తుతించారు. శ్రీవేంకటేశ్వరుని సంకల్పం భక్తుల మనోరథాన్ని నెరవేరుస్తుంది. అది ఒక కల్ప వృక్షంవంటిదే ఈ సంకల్పం దయాదేవి

చెప్పిన పనిని చేసే అవధిలో ఆమెకు వశమై ఉన్నది. ఒక పెద్ద గాలి కొడితే, మామిడి చెట్టులో పండిన పండ్లు ఒకే సమయంలో కింద రాలడాన్ని చూస్తున్నాము. ఆ విధంగానే, భగవత్సంకల్పం అనే కల్పవృక్షంనుండి కరుణ అనే పెద్ద గాలి వల్ల ఒకే సమయం లో రాలిన తీయని పండ్లవంటివి, ఈ శ్లోకాలు. అంటే, శ్రీనివాసుని కరుణ ప్రేరేపించగా, అతని సంకల్పం చేత, నా ద్వారా ఉదయించినది, ఈ స్తోత్రం. అందుచేత భక్తులు చక్కగా అనుభవించడానికి తగినది అవుతున్నది.

*108) కామం సంతు మిథఃకరంబితగుణావద్యాని పద్యాని నః*
*కస్యాస్మిన్ శతకే సదంబుకతకే దోషశ్రుతిం క్షామ్యతి /*
*నిష్ప్రత్యూహవృషాద్రినిర్ఝరఝరత్కారచ్ఛలేనోచ్ఛలన్*
*దీనాలంబనదివ్యదంపతిదయాకల్లోలకోలాహలః ॥*

ఈ శ్లోకాలు శ్రీవేంకటేశ్వరుడు, అతని సంకల్పం, నేను– అనే మా ముగ్గురినుండి ఆవిర్భవించాయి. వీటిలో గుణాలు మాత్రమే కాకుండా, దాసుని సంబంధం ఉన్నందునః దోషాలు కూడా కలసి ఉన్నాయని కొంతమంది భావించవచ్చు. కోరిన అవధిలో వారు కొరతలను పలుకవచ్చు. అందువల్ల నష్టం ఏమీ లేదు. ఎందుకు? అంటే, వారి దోషాల ఆరోపణ ఇతరుల చెవిలో పడితే కదా! పడకుండా ఉండేటట్టు దయాదేమి చేస్తుంది కదా. ఏ విధంగా అంటే, వాస్తవంలో మంచివారి హృదయంలో ఏదైనా కళంకం ఉన్నప్పటికీ, ఈ గ్రంథాన్ని పఠిస్తే, చిల్లగింజవల్ల నీటిలోని మురికి పోయేటట్లే, వారి మనసులో ఉండే కళంకం

తీరిపోతుంది. ఈ గ్రంథాన్నిగూర్చి ఇతరులు దోషాలను చెప్పడం సహిస్తుందా దయాదేవి! శ్రీవేంకటేశ్వరుడు, లక్ష్మీదేవి అనే దివ్యదంపతుల ఇద్దరి కరుణ ఒక రూపాన్ని పొంది, కష్టాన్ని పొందిన అందరికీ ఆలంబనమైన దయాదేవిగా ప్రకాశిస్తున్నది. ఈ దయాదేవి ఒక పెద్ద నీటి ప్రవాహంగాకదా ప్రవహిస్తూనే ఉంటుంది. తిరుమల కొండపై పెద్ద పెద్ద కొండవాగులు ప్రవహిస్తూ ఉంటాయి కదా. జర జర అని పెద్ద శబ్దంతో అవి ప్రవహిస్తూ ఉంటాయి కదా. అవి వాస్తవంలో ఏవి? అవి దయా దేవియొక్క ప్రవాహాలే. వాటి పెద్ద శబ్దం కరుణాప్రవాహంలో ఆవిర్భవించే అలల పెద్ద గర్జనలే. ఈ అలల పెద్ద పెద్ద శబ్దాల మధ్య ఈ గ్రంథంగూర్చి ఇతరులు పలికే దోషవాక్యాలు జనుల చెవిలో ఏ విధంగా పడతాయి? ఈ శబ్దాలలో ఆ మాటలు చెవిలో పడకుండా అంతరించిపోతాయి. ఈ విధంగా దయాదేవి ఈ గ్రంథాన్ని గూర్చిన దోషవాక్యాలు నిష్ఫలం అయ్యేటట్లుగా చేస్తుంది. దయాసవాహనలో అన్ని పాపాలు కొట్టుకొని పోయేటట్లుగా, ఈ గ్రంథాన్ని గూర్చి ఇతరులు పలికే దోష వాక్యాలు కూడా ఉండే చోటు తెలియకుండా అంతరించిపోతాయి.

ఈ దయా శతకంలో పది, పది శ్లోకాలను కలిగిన పది దశకాలలోను, ఒక్క దశకంలో సారార్థంగా ఈ క్రింది విధంగా 10 అర్థాలు ప్రకాశిస్తున్నట్లుగా పెద్దలు చెబుతారు.

సారార్థాలకు పక్కలో ఇవ్వబడిన సంఖ్య ఏమంటే, ఆ శతకంలో ప్రాణస్థానీయమైన సారార్థాన్ని ముఖ్యంగా సూచించే శ్లోకాల సంఖ్య.

భగవంతుడు మోక్షాన్ని ఇచ్చేవాడు,

అతడు అన్నిటినీ తెలిసినవాడు, అన్నిటినీ చేసే శక్తిని కలిగినవాడు,
భక్తుల విరోధులను పోగొట్టేవాడు,
అన్నిటికీ ఉపాయమై ఉండేవాడు,
పొందబడే ఫలమై ఉండేవాడు,
గొప్ప ఉపాయమైన ప్రపత్తిచేత పొందడానికి సాధ్యమైనవాడు,
తక్కువవారితో కలసి వర్తించే స్వభావాన్ని కలవాడు,
చాలా ఉన్నతమైనవాడై, శ్రీవేంకటేశ్వరుడై ఉండేవాడు,
రామకృష్ణాది అవతారాలను ఎత్తినవాడు,
ప్రపత్తి చేసినవారికి ఇక్కడే మోక్షానందాన్ని అనుగ్రహించేవాడు.

ఈ విధంగా పది దశకాలలో విచిత్రమైన పది సారార్థాలను పొందుపరచే అభిప్రాయంతోనే పది విధాలయిన వృత్తాలను ఈ గ్రంథంలో దేశికులు ప్రయోగించారని కూడా పెద్దలు చెబుతారు.

తరువాత కొందరూ భగవదనుభవరసికులైన మహాత్ముల అభిప్రాయం ఈ విధంగా ఉన్నది.

ఈ గ్రంథంలో ఒక్కొక్క దశకంలో లోపల గమనించి చూచినట్లయితే, ఒక్కొక్క దశకం తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఒక్కొక్క శతకంలోని సారార్థాలను అంతర్భవించుకున్నట్లుగా ఉన్నది శ్లోకాల సన్నివేశం. తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఒక్కొక్క శతకంలోని సారార్థాలను, తాత్పర్యరత్నావళిలోను, సారావళిలోను అనుగ్రహించడానికి ఆధారంగా చేసికొని ఇక్కడ చెప్పబడుతున్నది.

సేవ్యుడు—9,
అనుభవించటానికి చాలా మధురమైనవాడు—19,
అందమైన దివ్యమంగళ విగ్రహాన్ని కలవాడు—22,
సకల భోగ్య వస్తువుల కంటే చాలా భోగ్యంగా ఉండేవాడు—39, 40,
పురుషార్థాలను, వాటి ఉపాయాలను ఇచ్చేవాడు—49,
ప్రపత్తికి సులభుడు—51, 59, 60
అనిష్టాలను పోగొట్టే స్వభావాన్ని కలవాడు—61,
భక్తుల మనసును అనుసరించి వర్తించేవాడు—75,
సహజ సౌహార్దాన్ని కలవాడు—85,
అర్చిరాదిమార్గంలో ప్రయాణం చేసేటప్పుడు సహాయమై ఉండేవాడు—93,95.

ఈ అర్థాలను వారు వారు తమ తమ మేధావిలాసానికి తగినట్టు ఆయా దశకాలలోని శ్లోకాలలో విస్తృతంగా గమనించవచ్చు.

ఇతి శ్రీదయాశతకం సంపూర్ణం

కవితాతార్కికసింహాయ కళ్యాణగుణశాలినే,

శ్రీమతే వేంకటేశాయ వేదాంత గురవే నమః.

****

